శ్రీరస్తు.

# కుముద్వతీసారంగధరము.

## తృతీయాంకము.

రంగము—చిత్రాంగివీధి.

కన్నులు నలిపికొనుచు నయంధరుఁ డనుకంచుకి ప్రవేశించు చున్నాఁడు.

“నయంధరా! వత్సుఁడైనసారంగధరుండు రేపటిప్రాతఃకాలంబునఁ జిత్రాంగిసౌధమున కెదురం దనరు వివిక్తప్రదేశంబున వాహతకునితోఁ బావురపుఁబన్నిదము వైచు ననివింటి. సచివసహితుం డై సార్వభౌముఁడు దండయాత్రకుఁ జనుటం జేసి యిదియే సమయ మని యెంచి సపత్ని యగుచిత్రాంగి తా నేమివిపత్తు సంఘటింపఁ జేయునో. కాఁబట్టి నీవు వేఁకువను లేచి పరమార్థమును బరిశీలించి మంత్రితనయుం డగుసుబుద్ధికడకుం జని కుఱ్ఱవాని వెనువెంట నుండు మని నాపలుకులుగాఁ దెలుపుము” అని నిన్న కుముద్వతీద్వితీయ యగురత్నాంగిదేవిగా రానతిచ్చినారు. (అని యాకాశమువంకఁ జూచి) ఓహో! అప్పుడే తెల్లవారిపోయెను గదా.

చ. మలయసమీరవారమున మాటికిఁ జల్లఁదనంబు లూరెఁ; వె
న్నెలదొర జాఱెఁ గ్రుంకుమలనెత్తముఁ జేరెఁ; గడిందిచీఁకటుల్
కలుఁగులఁ దూఱెఁ; నెంతయును గల్వవెలందుక వంతఁ గూరెఁ; ది
వ్వెలు వెలవాఱెఁ; గోళ్లగమి కూయుచుఁ గేరెఁ; బలారె! యిత్తఱిన్.

గీ. మ్రొక్కినను వెక్కిరించిన నొక్కరీతి
నే ముదంబును బొందుచు నింగి నిలిచి
ప్రజలు గావించుపుణ్యపాపములు రెండు
మాని యైచూచు చున్నాఁడు భానుఁ డదిగో.

(దవ్వులకు దృష్టి సారించి చూచి) అదిగో! ఒడ్డీలు; లకోరీలు; బకదార్లు; పదతీలు! పల్లటీలు; పక్కవలు; కోకీలు ననుపేరెక్కినపారావతంబులఁ బుట్టికలం బెట్టుకొని బాలపరిచారకులు వెంట నడువ వాహతకబాభ్రవ్యులతో సారంగధరధరావరకుమారుఁ డీదారినే వచ్చుచున్నాఁడు (నిదానించి చూచి) అందఱును గపోతముల నెగుర వైచుచున్నారు. బాభ్రవ్యనిప్రోత్సాహంబున సారంగధరుండు పన్నిదమునకై పిట్టను వదలినాఁడు. ఇంకఁ దడయరాదు. సుబుద్ధిం దోకొని వచ్చెద.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

ఇది విష్కంభము.



శ్రీరస్తు.

# కుముద్వతీసారంగధరము.

## తృతీయాంకము.

రంగము—చిత్రాంగివీధి.

మింటనున్న పావురములపై దృష్టి నిలిపి చేయి వీచుచు
సారంగధరుండును; వాహాతకబాభ్రవ్యులును
ప్రవేశించుచున్నారు.

వాహ—సఖా! సారంగధరా! మనపారావతంబులు వారిజభవువాహనంబులం గేరడ మాడుచు మొగిలుదారి నేతీరునం బాఱుచున్నవో చూడుము.

క. పేరెమ్ములు వాఱుచును; స
మీరుహుటాహుటుని మిగుల మీఱుచు; గెలుపుం
గోరుచు; నుల్లాసంబునం
బారావతయుగము చనెడుపథముం గంటే?

బాభ్ర—యువరాజా! కను చెదర కుండ నా చేచాయ విలోకింపుము.

చ. కలికి చొకాటపుం గఱులగాలిని మబ్బులచాలు నెల్ల ది
క్కులకును ద్రోయుచున్; కుసుమగుచ్ఛవిలాసము గ్రేణిసేయుచున్;
కులగురుం డౌననూరుకడకుం జన నున్నదొ నాగ మింట నీ
జెలువపుం బావురంబు వెలిచెం గనుంగొమ్ము నృపాలనందనా!

సారం—భళే! బాభ్రవ్యా! ఇప్పుడు చూడుము.

గీ. మిన్ను పేరింటియన్నులమిన్న తనదు
కుత్తికం దమ్ముం ధరించిన ముత్తియంపు

గుత్తియో యన నెంతయుఁ గొఱలు చుండె
మనకపోతం బదే నభోమార్గమునను.

వాహ—ప్రభుకుమారా! పావురపుఁబన్నిదమును దుర్వ్యసనములలో నొకయంత ర్భాగమే యని యెవ్వ రే మన్నను నాబుద్ధి కింతకంటె మనోహరవ్యాపారము మఱియొకటి లేదు.

బ్రాహ్మ—నిశ్చయము. సుకుమారు లగురాజకుమారుల కింతకంటె మృదు వైనవ్యాయామము మఱియొకటి లేదు.

క. కుదురు గుఱి కన్నుఁగవకున్;
మదిఁ దోఁచుం బక్షిజాతిమర్మము లెల్లన్;
బొదలుం దేలిక మేనికి;
నొదవును భుజశక్తియు స్వహృల్లాసంబున్.

సారం—మిత్రులారా! మీ రెన్ని చెప్పినను సరే. ఇదియును నొకవిధ మగుద్యూతము వంటిదే.

వాహ—ఇందు ధనసంబంధ మేమి యున్నది?

సారం—ఓడినవాఁడు గెలిచినవానికిఁ దనపావురము నిచ్చివేయు టన నేమి?

బ్రాహ్మ—రాజకుమారా! ఇది యొకవినోదము గదా.

సారం—అదియేమో కాని యీవినోదము నాకు రుచించుట లేదు. నేఁ డేదియో కారణము లేనివిచారము నాహృదయము నలమికొని మిక్కిలిబాధించుచున్నది. గొప్ప నేరము చేసినవానివలె నాగుండెలు తటతట కొట్టుకొను చున్నవి. దివసభాగములు దీర్ఘములుగాఁ గానిపించుచున్నవి. ఎడమకన్నును భుజంబును నదరు చున్నవి.

వాహ—(తనలో) మాయుపాయమువలనఁ జిత్రాంగిమనోరథము పూర్ణముగా ఫలించునో? లేదో?

బ్రాహ్మ—యువరాజ! మహారాజు భయంకర మగుదండయాత్రయం దుండుటంజేసి గెలుపోటము లె ట్లుండునో యన్నభయసందేహములు నీహృదయము నాశ్రయించి యిట్లు నలుగుడులు వెట్టు చున్నవి. ఈవినోదమువలన సర్వవిచారములును బోవును. ఒకసారి నక్షత్రమార్గమున మెలఁగుపక్షులపంక విలోకింపుము.

(అందఱు నాకసమువంకఁ జూచు చున్నారు.)

సారం—ఓహో! మనము మాటలసందడి నేమరితిమి.

క. అక్కజ మహా శౌర! బలే!
నిక్కపుఁ జెలులార! మీరు నింగిని గనుఁడీ
యొక్కటియే కాన్పించుచుఁ
జుక్కలలో నొక్కచుక్క సొంపు వహించెన్.

అందఱు—(మఱల నాకాశమువంకఁ జూచి) ఔ నౌను. ఒక్కటియే కానిపించు చున్నది. రెండవది యెక్కడ?

వాహ—ఒక్కలబలిమి తక్కువ గాయె యెక్కడనైనఁ బడియె నేమో? లేక చుక్క లలోఁ జిక్కవడెనో?

బాభ్ర—నీపలుకులు నేను విశ్వసింపను. మనము సమశక్తి గలపులుఁగులనే యెగుర వైచితిమి కదా.

సారం—మిత్రులారా! నాబుద్ధి కిట్లు తోఁచు చున్నది.

వాహ—యెట్లు?

సారం— ఆ. జలధి వలఁతిచేఁప యలఁతిచేపను బట్టి
మెసవునట్లె నింగి మెలఁగునట్టి
శ్యేన మెదియొ కడుపు చిచ్చార్చుకొన నెంచి
చంపి భక్షణంబు సలుపఁ బోలు.

బాభ్ర—ఔ నౌను. ఇది సత్యమై యుండ వచ్చును. "శ్యేనాఃకపోతాన్ ఖాద యంతి" యనివేదములయందును జెప్పఁ బడియున్నది (తనలో) మాదురదృష్ట వశముచే నిజముగా నట్లే జరిగి యుండదు గదా.

వాహ—(ఆకాశమువంకఁ జూచి) యువరాజా! ఇప్పుడు చూడుము.

క. పలిటీలు గొట్టుచును భూ
తలమున నలరారు చున్నతనపెంటిఁ దమిం
దిలకించుచు నదె నాలెం
కలపొంతల వాలు చుండెఁ గనుఁగొమ్ము సఖా!

బాభ్ర—ఓహో! అబ్బాయిగారిపావురమే కాన్పించుట లేదే.

సారం—(విచారముతో) మిత్రులారా! పక్షులను పెంచుట దుఃఖహేతువు గదా.

ఆ. నింగి కెగుర లేక నెగు లొందు నొకచింత;
మేఁత మేయ కున్న మేటిచింత;
పరులచేతఁ బడిన బహుతరం బగుచింత
డేఁగ పట్టి తినఁ గడిందిచింత.

బాభ్ర—(తనలో) ఇంకను గోరకునికంఠస్వరము వినిపింప దేమి చెపుమా (ప్రకాశముగా) రాజకుమారా! మనము చూచు చుండ నయ్యండజము మాయ మగుటకుఁ గారణ మేమో యారయవలయును గాని యూరక విచారించిన లాభ మేమి? (తెఱలో) యువరాజ! సారంగధరా!

ఆ. ఱెక్క విఱుగ లేదు; చుక్కలలో లేదు;
జాలి జాలిమాలి చంప లేదు;
చిత్రముగను వ్రాలెఁ జిత్రాంగిమేడపైఁ
బొదలుపెంటిఁ గని కపోత మిపుడె.

సారం—ఇది కోరకునికంఠస్వరము. నే నిప్పుడు పావురమునకై రాణివాసమునకుఁ జనుట యుచితమో; యనుచితమో తెలియ కున్నది. (అని ముందునకుఁ జూచి) అదిగో! సమయమునకు సుబుద్ధియు వచ్చు చున్నాఁడు.

వాహ—(బాభ్రవ్యునితో రహస్యముగా) బాభ్రవ్యా! మన కోరక గలించిన దనుకొను చున్నాను. ఇది యేమి? సుబుద్ధియు నిప్పుడే వచ్చు చున్నాఁడు. చెడఁగొట్టునేమో.

బాభ్ర—(మరల రహస్యముగా) అదియే నేనును సందేయించు చున్నాను. అయినను సమయానుగుణ్యముగాఁ బ్రసంగింతము.

అప్పుడు సుబుద్ధి ప్రవేశించు చున్నాఁడు.

గీ. భూమిపతిమ్రోల నెవఁడు మోమోట విడిచి
యప్రియము నైన తథ్యమే యాడు చుండు
నట్టివానిని గని లోక మరుస మందు
దైవమునుగూడ మిగులసంతసము నొందు.

ఇప్పుడు తనపావురమును బోఁగొట్టుకొనుటం జేసి దానిం దెచ్చుకొటనుకై ప్రియసఖుఁడగుసారంగధరుండు చిత్రాంగిసౌధమున కరుగక మానఁడు. ప్రభుకుమారుఁడు గదా యని యుపేక్షించు టుచితము గాదు. మంత్రికుమారుఁడు సుబుద్ధి యుండి యింతమాత్రము నీతి చెప్పి కుమారుని మందలింపఁ జాలక పోయెను గదా యని పిమ్మట జనులు నన్ను నిందింతురు. కాఁబట్టి యీప్రయత్నము మాన్పింతును గాక. (అని ముందునకుఁ జూచి) వాహతక బాభ్రవ్యులతో సారంగధరుఁ డిదారినే వచ్చుచున్నాఁడు. సమీపించెద. (అని సమీపించి) జయము. జయము. యువరాజా!

సారం.—మిత్రమా! నీకు శుభ మగుఁ గాక.

వాహ + బాభ్ర—మంత్రికుమారా! నీకు స్వస్తి యగుఁ గాక.

సుబు—రాజకుమారులారా! మీకు జయ మగుఁ గాక.

సారం—మిత్రమా! సుబుద్ధీ! నీవు నాపావురము వోవుట యెఱుంగుదువా?

సుబు—ఎఱుంగ కేమి? నేనునుం జూచితి.

ఆ. ఱెక్క విఱుగ లేదు; చుక్కలలో లేదు;
జాలి జాలిమాలి చంప లేదు;
చిత్రముగను వ్రాలెఁ జిత్రాంగిమేడపైఁ
బొదలుపెంటిఁ గని కపోత మిపుడు.

వాహ—(బాభ్రవ్యునితో జనాంతికముగా) బాభ్రవ్యా! రాణి యగుచిత్రాంగి తరళికతో నేమేమియో మంతన మాడుచు నెవ్వరికిం గానరా కుండ నాగవాక్షమున నిదిగో! ప్రవేశించుచున్నది చూడు.

బాభ్ర—(మఱల జనాంతికముగా) చూచితిఁ జూచితి. నీవు మాటిమాటికి నావంకఁ జూడకుము.

అప్పుడు మేడపై నొకగవాక్షముకడఁ దరళికతోఁ జిత్రాంగి ప్రవేశించుచున్నది.

సారం—(మనస్సులో నేదియో ధ్యానించుకొను చున్నాఁడు.)

చిత్రాం—సఖీ! తరళికా! ఇప్పుడు మనము పట్టినరాపట్టిపిట్టను భ్రమరికచేత నిచ్చి వచ్చితిమి గదా. అది దానిని జాగరూకతగాఁ గాపాడునా?

తర—ప్రాణంబుకన్న మిన్నగాఁ గాపాడునని విశ్వసింపుము.

గీ. నామనోధన మెల్ల విన్నాణి యగుచు
దొంగిలించినదొంగ యీదొరనిసుంగ;
వీనిస్పర్శంబు నాకు లభించెనేని
బంటుగా నేలనే విరివింటిదొరను.

తర—(తనలో) అదియే దుర్లభము.

చిత్రాం—గీ. ఏమినోములు నోచెనో; యేమిమంత్ర
వితతి జపియించెనో; యెట్టివేలుపులను
వేఁడెనో; యీమహాత్మునివిభుతఁ గోరి
యాకుముద్వతి పూర్వజన్మాళియందు.

తర—నీవును గుముద్వతి వాంఛించినఫలంబునే వాంఛించు చుంటివి గదా.

చిత్రాం—లభింప వలయును గదా.

సుబు—చెలీ! నీ కది లభింపదు. ఆయాసను బూర్తిగా విడువుము.

చిత్రాం—(మనసు త్రొట్రుపడ వడఁకుచు) తరళికా! ఈబ్రాహ్మణవటువు మనపలుకులను వినియెనా యేమి?

తర—సఖీ! వెఱవకుము. అది సారంగధరునిఁగూర్చి పలికినవాక్యము.

సారం—సుబుద్ధీ! ఏమియద్భుతము. నాపినతల్లియింట వాలినపావురమే నాకు లభింపదా? వింతలు వినుచుంటిమి.

సుబు—రాజకుమారా! వివేకివి. దూర మాలోచించుకొనుము.

తర—సఖీ! దిగువయంతరువున కరుగుదము రమ్ము. అచ్చట వీరికిఁ గానఁబడకుండ నిలిచి వీరల విస్రంభాలాపంబుల నాలకింతము.

చిత్రాం—ఆలాగుననే (అని యిరువురు నట్లు చేయుచున్నారు.)

చిత్రాం—(కన్నారఁ జూచి) ఆహా! ఏమి యీరాజకుమారునిజగన్మోహనాకారము.

సీ. పల్లవారుణకాంతి ఫుల్లాబ్జములఁ గూర్చి
సలుపఁబోలును వీనిచరణయుగళి
ముత్తెంపుజిగి హేమమున నేరుపునఁ గూర్చి
విరచించెఁగాఁబోలు వీనితనువు
తెలిగంటిరాతాలతేజు తేఁటులఁ గూర్చి

కలిగించెనొక్కొ వీనికచభరంబు
బింబసత్ఫలమార్దవంబు కెంపునఁ గూర్చి
చేయఁబోలును వీనిచిగురుమోవి
సకలసౌందర్య రససారసంపదలను
నేరుపున నేర్చి తనచమత్కారమెల్లఁ
జూప నూహించి మిక్కిలిచోద్యముగను
వీనిసృజియింపఁ గాఁబోలు విశ్వగురుఁడు.

వాహ—మిత్రమా! సారంగధరా.

తర—సఖీ! వాహతకుఁ డేమో యనుచున్నాఁడు. వినుము

వాహ—ఇప్పుడు వైచినపన్నిదము చెడిపోయినది.

చిత్రాం—(తనలో) అందులకుఁ గారణము నే నని యీరాజకుమారుఁ డెఱుంగఁడు.

బాభ్ర—సారంగధరా! ప్రొద్దెక్కలేదు. మఱియొకపన్నిదము వేయుదము. ఆశారి రమును దెప్పింపుము.

చిత్రాం—(తనలో) ఇప్పుడు నాపు న్నెంపుగని సన్నిధికి రాక మానదు.

తర—(తనలో) సారంగధరునిపాలిటికాలసర్పమువలె నీదిక్కుమాలినపావురమెక్కడ సంప్రాప్త మైనది.

సుబు—(తనలో) ఈవాహతకబాభ్రవ్యులు సారంగధరున కనుకూలశత్రువులు గాని మిత్రులు గారు.

సారం—మిత్రులారా! రాణివాసంబున కన్యల ననుప రాదు గదా.

చిత్రాం—తరళికా! ఇతఁడు రసికజనాగ్రణి సుమీ. తనంతట తానే నాగృహ పావనము చేయఁ దలఁచుచున్నవాఁడు.

తర—ఆమహానుభావునిహృదయమున నేమియూహ యున్నదో. మబ్బులోనిప్రొద్దును మనసులోనియూహయు నెవ్వరికిఁ దెలియును.

చిత్రాం—సఖీ! తరళికా! ఈరాకడ చూడఁ దనమీఁద నాకెట్లున్నదో నామీఁదఁ దనకును నట్లే యుండవచ్చును. లేకున్న నెన్నఁడు నాగడపత్రొక్కని వన్నెకాఁ డింతసులభముగాఁ బయన మగుట కంగీకరించునా?

తర—(తనలో) ఎదిరిహృదయ మెఱుఁగఁజాలని దీని తెలివి తేటలు కాలుపనా! సంతలో జవ్వన మమ్ముకొను పణాంతకారి కింతకన్న మంచియూహ యెట్లు పొడ మును? (ప్రకాశముగా) అనల్పకాలములో నన్నియుఁ దేలును. తమకపడ నేల?

వాహ—యువరాజా! నీ కది పరగృహము కాదు గదా.

బాభ్ర—నిశ్చయముగా స్వగృహమే.

సుబు—రాజకుమారా! నీవు వివేకివి. దూరము పరికింపుము. నీ వెన్నఁడును బ్రాకృతుని తావిప్పుడు త్రొక్కుట మేలు గాదు.

చిత్రాం—తరళికా! ఈ బ్రాహ్మణహతకుఁడు కార్యభంగము సేయుచున్నాఁడు. చిత్రాంగి యని యెఱుంగఁడు కాబోలు.

తర—ఈతఁడు నీతత్త్వ మెఱుఁగఁడు.

సారం—నాపినతల్లియింటికి నేఁ జనుట దోసమా?

సుబు—అవును.

సారం—ఎందుచేత.

సుబు—మహారాజు నగరమున లేఁడు.

వాహ—ఉండిన నేమి? లేకుండిన నేమి? యువరాజు రాణివాసమున కరుగుట కేమి యభ్యంతరము?

బాభ్ర—బ్రాహ్మణసులభ మగుపిఱికితనముచే నాడినయీతనిమాటలను బాటిసేయ వలసినపని లేదు.

చిత్రాం—బాభ్రవ్యుఁడు బ్రాహ్మణవటువునకు బుద్ధివచ్చునట్లు చెప్పినాఁడు.

సుబు—రాజకుమారా! అప్రియము గాకేమి యని హితము పలుకువార రరుదు. చిన్నతనమునుండియు మనకున్న చెలిమిబలిమిని నాపలికినపలుకు లన్యథా తలంపకుము.

> గీ. నీవు సౌందర్యశాలివి నృపకుమార!
> చూడఁ జిత్రాంగియును గడుసుందరాంగి;
> సుందరుల చెందములు సదా సొగసుకాండ్ర
> పైకిఁ జనునని పండితుల్ వలుకుచుంద్రు.

అందఱు—(చెవులు మూసికొని) శివశివా! ఎంతమాటాడితివి.

వాహ—ఎవ్వఁడో శూద్రుఁ డాడవలసినపలుకులు గాని యివి పవిత్రమైన బ్రాహ్మణుఁ డాడవలసినపలుకులు గావు.

బాభ్ర—ఓరీ మూర్ఖా! బ్రాహ్మణాధమా! యువరాజు మొగము చూచి యూరకొంటి. లేకున్న నీకరవాలంబున నీనాలుక చీలికలు గావింతును.

తర—(తనలో) మేలు సుబుద్ధీ! మేలు. సారంగధరునకు నీవే నిజమైనమిత్రుఁడవు.

చిత్రాం—(తనలో) ఈదుర్మార్గుఁడు నాతలంపు పుణికిపుచ్చుకొనినట్లే చెప్పు చున్నాఁడు. వీని కండలు కోయించి కాకుల కెగురవైచెద.

సారం—(ఆగ్రహముతో) స్నేహాతిశయంబున నీ కెంతచనువున్నను నిట్లు పలుక వచ్చునా? నాతల్లి రత్నాంగి యొకటియుఁ జిత్రాంగి యొకటియునా? తల్లిబిడ్డల కెంతైన భేదము కలదా? తెడ్డునాకి యుపవాసము చెడిచికొనినట్లు శృంగారమే ప్రధానముగా నెంచి ప్రతిష్ఠాభంగము చేయునా? చాలుఁ జాలుఁ. ఇవి యేటి మాటలు? ఇంక నీవినఁ గొఱగానిపలుకుల విరమింపుము.

చిత్రాం—(తనలో) ఓరీబ్రాహ్మణకీటకా? నీ వావెలితియె కానిపించుకొంటివి గాని దీన నేమి బావుకొన్నావు.

తర—(తనలో) ఇప్పు డీసారంగధరుఁ డాడినమాటలు వినియు నీ మెకు దేహము నీరు కాకున్నది. ఓయీశ్వరా! ఈ మెరక్తమంతయు విషమేనా యేమి?

వాహ—మూర్ఖా! నీయధికప్రసంగమును గట్టిపెట్టుము.

బాభ్ర—సారంగధరుఁడు శాంతనిధి కావున బ్రదికిపోతివి. ఇంక నీదారిం బొమ్ము.

సుబు—చెలికాఁడా! సారంగధరా!

గీ. సవతితల్లియటన్న యుత్సాహ మొకటె
కాని చిత్రాంగి పచ్చిబోగంపుఁటాగ
యనుచు సుంతైన నెమ్మది నరయవైతి
నీవివేకం బదే మన నృపకుమార!

గీ. కామకోరిక కీకొనకున్న నిన్ను
నినునితోఁ జెప్పి శిక్షసేయించుఁ జుమ్ము
వలపదటు పోవు టుడుగుము వారకాంత
గాన పరువును గిరుపును దాని కేల?

సారం—సుబుద్ధీ! ఆమె యెవ్వతె యైన నేమి? నాతండ్రిసంబంధము ననుసరించి మాతృభావమునఁ జూచుకొనుచున్నాను. నీవు లక్షచెప్పినను నాముద్దులపావురము నేఁ దెచ్చికొనక మానను. మాకుఁ జక్కట్లు దిద్దక లేచిపొమ్ము.

సుబు—సారంగధరా! వీరల నిక్కంపుఁజెలికాండ్రనుగా నమ్మి నీవు నిష్కారణముగాఁ జెడుచున్నావు. నిజము నిలకడమీఁదఁ దెలియఁగలదు; నిదానించుట మేలు. ఇదె నేను పోవుచున్నాను. (అని తనలో)

గీ. కటకటా! విధి! కష్టముల్ గదియుకడకె
దేహధారులనెల్ల సందియము లేక
తోడికొనిపోదు విది మహాద్భుతము కాదె
నీమహామహిమంబు వర్ణింపఁ దరమె.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

చిత్రాం—ఛీ! భూసురపిశాచమా! శీఘ్రముగా వదలిపొమ్ము.

తర—(తనలో) ఆహా! కలిగినకంటికి దీపము గిట్టదు గదా.

చిత్రాం—తరళికా! యువరాజు రానున్నాఁడు. మనమును దగుప్రయత్నమున నుందము రమ్ము. (అని చిత్రాంగియుఁ దరళికయు నిష్క్రమించుచున్నారు.)

సారం—మిత్త్రులారా! మీరు నారాక నిరీక్షించుచు వైమానికహర్మ్యమున నుండుఁడు నేనును బావురంబును గైకొని మిమ్ముం గలిసికొనియెద.

ఇరువురు—నీయాజ్ఞాప్రకారము గావించెదము (అని నిష్క్రమించుచున్నారు.)

సారం—ఇదె సింహద్వారము. లోని కరిగెద. ఇచ్చట పణిహారు లెవ్వరును లే రేమి చెపుమా. కానిమ్ము. లోని కరిగెద. (అని సింహద్వారము దాటుచున్నాఁడు.)

అప్పుడు చిత్రాంగియుఁ దరళికయుఁ బ్రవేశించుచున్నారు.

తర—సఖీ! చిత్రాంగీ! ద్వారములకడ నొకయొఁగనైన లేకుండఁ జేసితివి. ఆజ్ఞ యనిన నీయదియే యాజ్ఞ.

చిత్రాం—చెలీ! మనకు రహస్యగోపనము ముఖ్యము సుమీ.

తర—నే నెఱుంగనా యేమి?

చిత్రాం—నాహృదయము కాలహరణమునకుఁ దాళఁజాలకున్నది.

క. రాఁ డమ్యోఁన్ విభుఁడు; క్షణం
బేఁ డమ్యోన్; విరహశరధి నె ట్లీఁదుదు; క్రో
వ్వాఁడిలకోరుల విరివిలు
కాఁ డడరె సఖీ! యిఁ కేమి గతియో చెపుమా?

తర—సఖీ! ఓరుచుకొమ్ము.

చిత్రాం—మఱల సుబుద్ధి దాపరించె నేమో.

తర—మనము చూచుచుండఁగానే కదా యతం డింటిదారి పట్టినాఁడు. (అని ముందు నకుఁ జూచి) సఖీ! ఆశ్చర్య మాశ్చర్యము.

చిత్రాం—అది యేమి ?

తర— గీ. నీవనుభవింప నెంచిననిరుపమాన
దివ్యఫల మదె చూడు మిందీవరాక్షి !
పడసి తిన్నాళ్లకును మహాభాగ్యగరిమ
నేఁడ వాంఛితసంసిద్ధి నెగడు నీకు.

చిత్రాం—తరళికా! నీపలుకుబడిని మఱియొకవిధముగా నర్థము స్ఫురించుచున్నది.

తర—సఖీ! చిత్రాంగీ! అం దనర్థ మెద్దియు లేదు. హృదయము చెదరుటంజేసి యట్టి శంకలు పొడముచుండును.

చిత్రాం—నిజముగా నాహృదయము చెదరియే యున్నది సుమీ. (అని సారంగధరుని కన్నులకఱవు దీఱఁ జూచి) సఖీ! తరళికా! నింగి నున్న సారంగధరుఁడే నేల వాతెనా యేమి ?

ద్విపద. ముదితరో! యీజగన్మోహనాకారు
ముదమున నాదివ్యసదనంబుఁ జేర్చి
పదసరోజంబులు పన్నీటఁ గడిగి
మెదఁ గల్గు జిల్గుపయ్యెదఁ జక్క నొత్తి
గంధంబు మేన నలంది చెందమ్మి
పొందమ్మి మొదలైన పూసరుల్ వైచి
కోరిన వెల్ల నవ్వారిగా నొసఁగి
కోరికల్ దీఱ నెక్కుడుకూర్మిఁ జూపి
పడకటింటను జేర్చి బాగాలు నాకు
మడుపులఁ దమి నిచ్చి మమత రెట్టించి
మఱి మఱి సీధరామదనుండు గొంత
కొఱికిన మడుపు మక్కువతోడఁ గొనుచు
నాటలమాటల నలరించి వచ్చి
పాటల నవ్వించి భావజశాస్త్ర

గతరహస్యంబు లక్కఱతోడఁ దెల్పి
రతిరాజు నాదువారవుబంటుఁ జేసి
మదనసామ్రాజ్యసంపద భాసిలంగఁ
దుదిలేనిసౌఖ్యాబ్ధి దోఁగుచు నుందు.

తర—(తనలో) ఔరా! ఈవేశ్య రాఁగలభోగముల కుబ్బుచున్నది. కాఁగలకార్య మెఱుంగ కున్నది (ప్రకాశముగా) సఖీ! ఇఁక మహారాజుగతి.

చిత్రాం—వెడఁగుఁబడుచా! మనము నిలు మన్నచోట నిలుచుమహారాజు లెక్కయే మే.

సారం—ఇదిగో! పినతల్లిగారు ప్రియసఖి యగుతరళికతో నీదారినే వచ్చుచున్నారు.

తర—(తనలో) భూతలేంద్రుం డీదుర్జాతి కెంతలేత యయ్యెను (ప్రకాశముగా) అతఁ డదె వచ్చుచున్నాఁడు.

చిత్రాం—ఎదురుపోయి బహూకరింతము రమ్ము. (అని యిరువురు నట్లు చేయుచున్నారు.)

చిత్రాం—జయము. జయము. రాజకుమారా!

సారం—మహారాజువిషయమున జరుపవలసినమరియాదను నావిషయమై నడుపుట ధర్మము గాదు.

చిత్రాం—రాజుతరువాత రాజంతఃవాఁడవు. మహారాజు నగర్భంబున లేమింజేసి నాకును నాపరిజనంబునకును నీవే రాజవు.

తర—(తనలో) ఔరా! ఏమి యీపడపుఁజెలి గడుసురాకడ.

సారం—అమ్మా!

చిత్రాం—అట్లు పిలిచెద వేమి?

సారం—నేను నీకుమారుఁడను గానా?

చిత్రాం—నాకు మారుఁడవు కావుననే యట్లు పలికితి.

తర—(తనలో) వారస్త్రీ విద్యావతి యగుటయు లోకమునకు హానికరమే గదా.

సారం—(తనలో) ప్రసంగమంతయు మఱియొకవిధముగా నున్నది. ఈపదనున మఱలుటయే యుచితము. (ప్రకాశముగా) అమ్మా!

చిత్రాం—నన్నట్లు పిలువరాదు.

సారం—కతం జేమి?

చిత్రాం—మహారాజు దయచేసిన బిరుదమును నీవే విడుచుట న్యాయము గాదు.

సారం—ఆబిరుద మెద్ది?

చిత్రాం—"రాణి"

సారం—(నివ్వెఱపడి తలవంచుకొనుచున్నాఁడు.)

చిత్రాం—మానినీసూనబాణా! అట్లు తలవంచుకొనియెద వేమి? కన్నారఁ జూచి నోరార నొక్కసారి "రాణీ" యని పిలువుము.

తర—(తనలో) ఔరా! ఈవారకాంత శరీరము మఱచి మిక్కిలి పచ్చిగాఁ బ్రసంగించుచున్నది.

సారం—(తలవంచుకొని) తనయు లట్లు పిలుచు టుచితంబు గాదు. నీ వెఱుంగని ధర్మ మే మున్నది?

చిత్రాం—రాజకుమారా? పోనిమ్ము. "రాణీ" యని పిలువ మనసు రాదేని "దేవీ" యని పిలువుము.

సారం—(తనలో) ఈమె ప్రసంగంబంతయు మఱియొకవిధముగా నున్నది. సుబుద్ధిబుద్ధి వినక చెడితి. ఇప్పు డేమి సేయుదు. (ప్రకాశముగా) అమ్మా! నే వచ్చి కడుంబడ వాయె. ఆవల చెలికాండ్రు నాకై వేచియుందురు. ప్రమాదవశమున నీమేడపై వాలిననాముద్దులపావురమును.

చిత్రాం—పావురమున కేమి?

ఆ. రాక రాక నేఁడు రాకరాకవిధాన
విందవగుచు నాదుమందిరంబుఁ
జొచ్చినాఁడ విచటి సోయగంబులనెల్లఁ
జూడకుండఁ జనుట పాడి యగునె.

సారం—ఆ సోయగంబులెల్లఁ జూచినరీతినే
సంతసించె నాదుస్వాంత మిపుడు
పావురంబు నొసఁగి పంపుమీ నీపాద
కమలములకు వందనము లొనర్తు.

చిత్రాం—సారంగధరా! నినువంటిసుమాయుధసమానులు రమణీమణులకుఁ బ్రణయకలహసమయమునఁ గదా వందనములు సేయుట (అని తరళికను జూచి) చిలుకపంజరంబు తలుపు మూయ మఱచి వచ్చితి. తరళికా! నీవు చని వదిలపఱుపుము.

తర—అలాగుననే (అని కొంచెము నడచి తనలో) చిలుకపంజరంబు నిదివఱకే మాలతిచేత నిచ్చివచ్చితి. ఎవ్వరికిం గానిపింపకుండ నీతలుపుచాటున నిలిచి యీ యాటకత్తియమాటల నాలకించెద. (అని యట్లు చేయుచున్నది.)

సారం—అమ్మా! ఇది యేమి? మర్యాదేతరప్రసంగము జరుపుచున్నావు.

చిత్రాం—మర్యాదేతరప్రసంగమా? కాదు. ఈపీఠము నలంకరించి సావధానచిత్తుండవై వినుము.

సారం—(పీఠమునం గూరుచుండి) అమ్మా! ఆనతిమ్ము.

చిత్రాం—గీ. నాఁడు శృంగారవనమున నళినబాణుఁ
గొలుచువేళను రెండవ యలరువిల్తు
నిన్నుఁ గన్నారఁ గని యొక్క-వన్నెలాఁడి
మేలుపడియెను జుమ్ము నృపాలతనయ!

తర—(తనలో) ఈపణ్యాంగన యన్యాపదేశంబుగా నిజహృదయంబు వెలిపుచ్చుచున్నది.

సారం—అమ్మా! ఆమె నాహృదయ మెఱుంగ దనుకొనియెద.

చిత్రాం—సారంగధరా! ఆమె సౌందర్యవతి యగునా కాదా యని సంశయింప వలసినపని లేదు. ఆమెమొగము శరత్కాలచంద్రబింబము. కన్నులు కలువరేకులు. నేయేల? కవులు వర్ణించువర్ణనలెల్ల నామెయందుఁ బూర్ణీభవించియున్నవి.

సారం—వర్ణనల కేమి?

సీ. పగశరచ్చంద్రబింబము మొగంబును గాదు;
తొవజంట వాలుకందోయి గాదు;
కొదమతేంట్లు వినీలకుంతలంబులు గావు;
మోవియం దమృతంబు మొలవలేదు;
భ్రూయుగ్మకము చిత్తభూధమ్మర్లత గాదు;
గగనంబు మధ్యమై క్రాలలేదు;
చక్కటి పలుకులై జనియింపఁగాలేదు;
విమలకాంచనము దేహమును గాదు;

ముక్తిమార్గావరోధలౌ పొలంతుకలకు
సకలకవిజనవంచితస్వాంతుఁ డగుచు
మలమలినకామినీసంగమంబుఁ గోరి
పండితోత్తముఁడును మోసపడుచునుండు.

తర—(తనలో) భళీ! సారంగధరా! వేయిచిత్రాంగు లొక్కటియై వచ్చినను నీ హృదయమును జలింపఁజేయఁజాలరు.

చిత్రాం—సారంగధరా! నీ వామెను జాడమింజేసి యట్లు పలుకుచున్నావు. ఆమె కేవలము నన్నుఁ బోలియుండును. నన్నుఁ జూచినవారెల్లను నామెయే నేనను కొనియెదరు.

తర—(తనలో) ఈమె క్రమక్రమముగా లజ్జను విడుచుచున్నది.

చిత్రాం—సారంగధరా! అట్టివన్నెలాఁడి నీమనసునకు వచ్చునా? రాదా?

సారం—(తనలో) ఈమె నాహృదయమునకు రుచింపనిసంభాషణము సేయుచున్నది. సురుంగ నయితి గాదు. ఏమి సేయుదు. (ప్రకాశముగా) అమ్మా! నే నేకపత్నీ వ్రతుండ నని యెఱుంగవా? నాహృదయము పరిశీలింపవలయునని యట్లు పలికితివి కాఁబోలు.

తర—(తనలో) బళే! సారంగధరా! వ్రతనియమ మన్న నీయదియే వ్రతనియమము.

సీ. అమలమౌక్తికహారసముదయంబును జూచి
స్వర్ణాంగదాదిభూషలను జూచి
చెలువంపుఁగస్తూరితిలకసంపదఁ జూచి
మురిపెంపుముక్కుముంగరను జూచి
పిఱుఁదులవెలయించుమిలువచీరను జూచి
వలపొప్పు తావిపూఁతలను జూచి
కలహంసములనవ్వుగమనరీతులను జూచి
చిలుకలనిరసించుపలుకులఁ జూచి
యజ్ఞులందఱు మోహంబు నందుచుంద్రు;
కాని నీబోటిప్రాజ్ఞుఁడు వానినెల్ల

గడ్డిపరకల తెఱఁగునఁ గని తలంచు
నారులనఁగను నరకార్థనామ లనుచు.

చిత్రాం—రాజకుమారా! బహుభార్యాత్వము క్షత్రియులకు దోషంబు గాదు. అనం
తరము వినుము. అట్లు నిన్నుఁ జూచి పరమాద్భుతరసాక్రాంతహృదయయై చెలికత్తె
మొగంబునఁ జూచి నిలిపి. (తనలో) నాయనురాగము తేటపడున ట్లుక్తినయిం
చెద. (ప్రకాశముగా) సారంగధరా! దానియానంద మేమి చెప్పుదు.

ఉ. "మేలిమిజాళువాపసిఁడి మేలము లాడెడు మేనివాఁడు, కం
జాలయ కాలయంబయినయట్టికనుంగవ గల్గువాఁడు, నీ
లాలనుబోలు కుంతలములం దనరారెడువాఁ, డితండు న
న్నేలినచోఁ ద్రిలోకముల కేలికనానిగ నుత్సహించెదన్."

సీ. "ఈమోహనాకారు నెనసి కౌఁగిటఁ జేర్చు
సకియ జన్మఫలంబె జన్మఫలము
ఈసౌకుమార్యుఁ జేరి సౌఖ్యము గాంచు
పొలఁతుకపున్నెంబె పున్నియంబు
ఈరాజపరమేశు నారాధనము సేయు
భామనోముఫలంబె నోముఫలము
ఈరసికాగ్రణిఁ గోరి పెండిలి యాడు
చేడెప్రోడఁదనంబె ప్రోడఁదనము
ఎవ్వతెకు నబ్బు నిటువంటినవ్వుమొగముఁ
జెలువపుఁగని నయంబుఁ గలసిమెలసి
యమలసంసారసరసి నోలాడుకలిమి
యామెభాగ్యంబె భాగ్య మహో తలఁప."

అని యువ్విళు లూరఁ జాగినది.

సారం—అమ్మా! నేను పావురమునిమిత్తము వచ్చితి. నీ వేదియో యప్రస్తుతప్రసంగ
తెచ్చి కాలహరణము చేయుచున్నావు. నాకు సెలవొసంగుము.

చిత్రాం——సారంగధరా! తమకపడియెద వేల? ఇది నీకుఁ బరగృహమా? (అని తన్నుఁ జూపికొనుచు) ఈపరిజనము నీపరిజనము. నీ కిచట వచ్చినలోప మేమి? నీకై మేలుపడిన యీవాలుగంటి పిమ్మట పొందిన విరహతాపంబును వినుము. నీ వేమి మంతరించినావో కాని కంతుసంతాప మంతకంతకు బళకర మై యొక నాఁడు సింగారపుఁదోట కరిగి యొక్క పూవుటీరముం జేరి కందర్పశరంబుల డెందంబు చిందరవందరయై—— (తనలో) ఈసారి నామనోవేదనయంతయు వెలిఁబెట్టి యతిశయింతేద.——

ద్విపద. "సారంగధర! మనసారంగ నిన్నుఁ
గూరిమి మీఱఁ గన్గొన్నది మొదలు
అసమాంబకుండు క్రూరాత్మకుఁ డగుచుఁ
గుసుమసాయకములఁ గురియింపఁ జొచ్చెఁ;
జిలుకలనోళ్లను వెలువడినట్టి
మలయమారుత మగ్ని మాటికిఁ జిమ్మెఁ;
దొగల నెచ్చెలికాఁడు తుంటరి యగుచు
నెగు లెచ్చ వేఁడివెన్నెలఁ గాయఁ జొచ్చెఁ;
బులుకాసిపులుఁగుగుంపులుఁ గెంపుకంట్లఁ
గలఁత వెట్టుచుఁ గూయఁగా మొద ల్వెట్టెఁ;
గంటికి నిద్దుర కడుఁ గఱ వయ్యె;
వంటకమింద దావంతయేనియును;
నను వెతపెట్టక నరనాథతనయ
కనికరంబునఁ జూచి కౌఁగిలి నొసఁగి
మదనతాపం బార్చి మక్కువ మిగులఁ
దుదిలేనిసౌఖ్యాబ్ధి దోఁగింపఁ గదవె;
అన్యముగాను స్వామాన్యను నీకు
ఖన్యాత్మఁ గావించి తగనుద్ధరింపు."

అని పరిపరివిధములఁ బలవింపఁ జొచ్చినది. అట్టిసుందరిని నీ వాదరింపవలయునా? లేదా?

సారం——అమ్మా! సారంగధరునకుఁ గుముద్వతి దక్కఁ దక్కినపల్లవపాణు లెల్లఁ దల్లు లని తలంపును.

చిత్రాం——నీమీఁది ప్రేమచే నా మెత్రప్రాణంబులు విడుచునేమో.

సారం——భగవంతుం డగుకామసంహరుం డా మెను నామీఁది మోహమును మఱలించును గాక.

తర——(తనలో) ఆహా! సారంగధరా! నిన్నుఁ జెప్పి శ్రీశుకునిం జెప్పవలయు.

చిత్రాం——(తనలో) ఈతఁడు నాయింగితం బెఱింగియు నెఱుంగనివాని తెఱంగున మెలంగుచున్నవాఁడు. ఇంక నాహృదయము స్పష్టపఱుపకున్న నదయుండై మదనుండు తీవ్రప్రదరంబుల నదరంట నేసి తుద ముట్టింపక మానఁడు. సముఖమున రాయబార మేమిటికి? బలిమినైన నావాంఛితము నెఱవేర్చుకొనియెదఁ గాక. (ప్రకాశముగా) వన్నెకాఁడా! నిన్నుఁ గామించినయయ్యన్నులతలమిన్న నెన్నఁడైనఁ గన్నారఁ గన్నావా?

సారం——కలయందును గనలేదు.

చిత్రాం——సుదతీనవమదనా! నీయెదురనున్న యీమదవతినే నీ వెఱుంగవా? (అని తన్నుఁ జూపికొనుచున్నది.)

సారం——(చెవులు మూసికొని తనలో) శివశివా! ఎంతకర్ణకఠోరము లగుపలుకులు వినవలసి వచ్చినది (అని తలవంచుకొనుచున్నాఁడు.)

తర——(తనలో) ఇసీ! ఈమె సతీజనవ్యతిరేకం బగుదుష్కృత్య మొనరింపఁ జూచుచున్నది. ఇఁక నే నిట నిలుచు టుచితంబు గాదు (అని నిష్క్రమించుచున్నది.)

చిత్రాం——సారంగధరా! నాపలుకులు కట్టు తలవంచుకొనెద వేల? ఇంతకన్న యుక్త సమయము మఱి దొరకదు.

చ. తడవులనుండి నీయెడలఁ దార్కొనె నాహృదయంబు; నేఁటికిన్
వెడవిలుకానిఁబోని నిను వేడుకమీఱఁగ నొంటిగాఁ గనం
బడసితి; లోచనంబు లతిపావన మయ్యెను; ధన్య నైతి; న
న్నడజడి వెట్ట కేలుకొనుమా యనుమానము మాని ప్రాణికన్.

సారం.—

ఉ. అమ్మరో! యిట్టి కానినుడు లాడఁగ నో రెటు వచ్చె నమ్మ; పా
పమ్మన కెంతసాహసము పాలొనరించితి వమ్మ నీమదిన్;
వమ్మొనరించి కీర్తి పశ్చన్వర్తన కెట్లు కడంగి తమ్మ; యు
క్తమ్మగు సత్సతీమణులదారిని బొమ్మ; శుభమ్ము నీ కగున్.

అమ్మా! కాయమ్ములే యనుక్షణాపాయమ్ము లనునప్పు డీకఁ బ్రాయమ్ములు వేఱ చెప్ప నేల? అల్పసుఖమ్మునకై దండధరుబాధ కేల పాలువడియెదవు?

చిత్రాం.—సారంగధరా!

ఉ. ఎక్కడ నేర్చినాఁడవుర? యీవెడప్రానుడు లింతవింత లేఁ
జక్కనిపాయమందె సరసప్రకరంబు హసింపఁ; జాలుఁజాల్
దక్కితినన్న యన్నువు వితా పరితాపముపాలు సేఁత యే
మక్క! యఘంబు గా దఁటర; మానసమందుఁ దలంచి చూడరా.

దండధరుఁడు వెట్టుబాధ దయ్యె మెఱుఁగును. పుష్పకోదండధరుఁడు వెట్టుబాధ కోరువంజాల. ప్రాణదానంబుచేసి కాపాడుము.

సారం.—(తనలో) హా దైవమా! మృత్యుపంజరంబునడుమం జిక్కినపక్షిపగిది నే నిక్కడ చిక్కుపడితిని; సుతురంగ వల నెఱుంగకున్నవాఁడ. ఏమి సేయుదు. సఖా! సుబుద్ధీ! నీపలుకు విననియవివేకమునకై నిన్నే మని క్షమింప వేఁడుకొందును! ఏ మొగము వెట్టుకొని నిన్నుఁ బలుకరింపఁగలుగుదు. (ప్రకాశముగా)

ఆ. పిన్నతల్లి వనుచు బిడ్డగా వీక్షింతు
వంచు మదిని విశ్వసించి యిటకు
వచ్చినతమల్లకును వాకొనఁగా రాని
పలుకులాడ నీకుఁ బాడి యగునె?

చిత్రాం.—సారంగధరా! నేను నీకుఁ దల్లిని గాను భూవిభుని భోగభామినిని. కాఁబట్టి,

శా. రారా; నాతమిఁ దీర్పరా; నెనరునన్ రక్షింపరా; క్రూరుఁడై
మారుం డెంతయు ఘోరసాయకములన్ మర్మంబులన్ వ్రీల్చెరా;
కారాకూరము లేల చేసెదవురా; గారాము మీఱంగ నన్
జేరం జీరర; కౌఁగిలీయర దొరా! సిగ్గేలరా? వీడరా.

అని పైనున్న యుత్తరీయమును జేతితోఁ బెనివైచి పట్టుకొనుచున్నది.

సారం—గీ. ధరణినాథుండు లేనియిత్తఱిని నీదు
నగరు సొచ్చు టదెంతయు నాదె తప్పు
విడువు విడు మింకఁ జాల్పదివేలు వచ్చెఁ
బోయెద ననుజ్ఞ నొసఁగుము పూవుబోణి!

అని యుత్తరీయమును విడిచి పాఱిపోవుచున్నాఁడు.

చిత్రాం—సారంగధరా! ఇదియేనా నీరసికత? ఇదిగో పావురము తీసికొనిపోవుదువు గాని రమ్ము నాయతిమోహమును వితసేయుట న్యాయంబు గాదు.

సారం—(దూరమునుండియే) అమ్మా! నాహృదయమును దెలిపెదను వినుము.

గీ. నింద లోకవేయి తలమీఁద నిలువనిమ్ము
పోయినను గాలుసేతులు పోవనిమ్ము
పరసతుల నెల్లఁ దల్లులపగిది నెపుడుఁ
గాంతు నీశ్వరసాక్షిగాఁ గమలవదన!

అని మఱియొక ద్వారము దాటుచున్నాఁడు.

చిత్రాం—(మహాకోపముతో) ఓరీ దురాత్మా! రసికతావిహీనా! నావల పాఱడిపాలు చేసి పోవుచున్నావు గదా. నీ కీచక్రందనం బేటికి? కాలుపనా? నీ వొక యంగవిహీనుండవై యుండిన నాబోటిబోటుల కిటువంటిపాటులు లేకపోవును గదా. కానిమ్ము. ఇదిగో! నీయుత్తరీయము నాచేతం జిక్కినది. మహారాజు వచ్చినతరువాత ని న్నేమిచేయించెదనో చూడు.

సారం—(మఱియొక ద్వారము దాటి) తల్లీ!

ఆ. ఎవనివలనఁ గలిగె నీశరీరం బట్టి
గురుఁడె సవతితల్లి గూహకమున
దండనంబు సేయఁ దలపడ్డ నాతని
తనువు నతని కొసఁగెదను నిజంబు.

అంతమే కాని సారంగధరునిహృదయంబు దుష్కార్యాచరణమునకుఁ జొఱ దని విశ్వసింపుము. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

చిత్రాం—ఇంక నీతనివలనఁ గామోపభోగంబులందు యోగంబు లేదు. ఈసాహస కార్యంబు వెలిదై నింద నన్నుఁ జెందకుండ సారంగధరుఁడే బలాత్కరించె నని రాజున కెఱఁబోసి కఠినముగా శిక్షింపించెద. ఈయువరాజు రూపుమాసినచో రాజునవంతరంబునందును యథేచ్ఛముగా రాజ్యోపభోగంబుల ననుభవింపవచ్చును. కావునఁ దద్విషయికప్రయత్నములు గావించెద.

(అని నిష్క్రమించు చున్నది.)

ఇదితృతీయాంకము.

---

శ్రీరస్తు.

# కుముద్వతీసారంగధరము.

## చతుర్థాంకము.

రంగము—పురవీధి.

[వేగవంతుఁడు ప్రవేశించు చున్నాఁడు.]

గీ. గుత్త వెలమోసకత్తియ పొత్తు పత్తి
దానికిని సర్వతంత్ర స్వతంత్రమిచ్చి
దాసుఁడై యున్న మూర్ఖభూధవునిఁ గొలిచి
జీవనము సేయుపనికంటెఁ జావు మేలు.

ఇంకను విజయధ్వజంబు కోటకొమ్మలపై నాటలేదు. విజయ భేరీనినదంబున గెలుపు వెలిపుచ్చ లేదు. దురంబునఁ జిక్కినయరాతి కిరాత వరూథినీవరులఁ జెఱ నిడ లేదు. అప్పుడే మహారా జంతఃపురంబున కరుగుటయు; రాణి యగుచిత్రాంగి యే మేమియో నూరి చెవికెగఁ బోయుటయు; నతండు ప్రళయకాల కాలుండునుం బోలె మండిపడుచు నిండోలగంబునకు విచ్చేసి “వేగవంతా! సచివు లగునయార్ణవ నీతిజ్ఞులం బిలిచికొని రమ్ము” అని సాకానతిచ్చుటయు సంభవించినది. ఈ దినమున నెవ్వనికి యుగము మూఁడి యుండవచ్చును జెపుమా (అని కొంచెమాలోచించి) ఆఁ. ఆకళింతకు వచ్చినది. నిన్ననేమో పారావతంబునకై సారంగధరుండు చిత్రాంగి నగరున కరిగెనని వింటి. సపత్నీ పుత్త్రుం డగుటంజేసి సారంగధరునియెడఁ జిత్రాంగి కాగ్రహ ముండుట సహజము. కావున నమ్మహానుభావునిపై నేవేవియో కొన్ని నేరములను గల్పించి భూమీశుని చెవి కెక్కియుండవచ్చును.

నా యీ యూహయే నిశ్చయమైనయెడ రాజకులంబు దుఃఖభాజన మగునుగదా. విధి వినోద మెట్లున్నదో తెలియదు. రాజశాసనంబు దురతిక్రమణీయంబు గావున నయార్ణవ నీతిజ్ఞులం దోడ్కొనివచ్చి వారి వెంబడినుండి నేనును సర్వంబును గనిపెట్టి గౌతమీ ద్వితీయ యగురత్నాంగిదేవిగారికి విన్నవించెద.

(అని నిష్క్రమించు చున్నాఁడు.)

ఇది ప్రవేశకము.

—••••••—

శ్రీరస్తు.

# కుముద్వతీసారంగధరము.

## చతుర్థాంకము.

రంగము—సభామందిరము.

రాజరాజ నరేంద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.

ఆ. చెప్ప రానిగొప్ప తప్పు సంప్రాప్తించె
నధిపు మందిరంబునందె భళిర!
ఇంతకన్న ఘోర; మింతకన్నను మహా
పాతకంబు గలదె పట్టి చూడ.

నేరమా చెఱుపు నేరము. నేరము చేసినవాఁడా కానకకన్న సూనుఁడు. నేరము వలని ఘోర పరాభవదుఃఖము ననుభవించినది యన్ననో నన్నుఁ బ్రాణంబుకన్న మిన్నగా మన్నించు నన్నుల తలమిన్న యగుచిత్రాంగి. అంతరాత్మయుఁ; బంచభూతములును దక్క మఱిసాక్ష్యమా కానిపింపదు. ధర్మ పరిపాలనాధికారి యగు ధారుణీశుఁడే తనశుద్ధాంతమున జరిగినలోకవిరుద్ధం బగునసద్ధర్మంబు నుపేక్షించిన చో నిహపరములకు దూరుఁడగును. లోకుల వలని నింద కెద్దిమేర? నే నీయెడఁ గడుపుతీపిచేఁ గొడుకని చూడరాదు. చిత్రాంగి యమాయిక హృదయ. సత్యసంధురాలు. ఆదురాత్ముఁ డెన్నెన్నియో బాధలు పెట్టి యుండవచ్చును. కాకున్న "జీవితేశ్వరా! ఆకామాంధుని కాలుసేతులు నఱికించి నాకన్నుల యెదుట నిడకున్న నన్న పానాదులు వర్జించి ప్రాయోపవేశంబు చేసెద" నని గోలుగోలున నేడుచునా? కొన్ని కారణములనుబట్టి చూడ సారంగధరుండు తప్పక యీ నేరము చేసినట్లు స్ఫురించుచున్నది. ఒంటిగాఁ దగవు తీర్చుట సర్వజ్ఞునకైన నుచితంబు

గాదు. కావున మంత్రు లగునయార్ణవ నీతిజ్ఞులతో యోజించి న్యాయ నిర్ణయంబు చేసెద. (అని ముందునకుఁ జూచి) అదిగో! వారును వచ్చుచున్నారు.

అప్పుడు నయార్ణవ నీతిజ్ఞులు వేగవంతునితోఁ
బ్రవేశించుచున్నారు.

నయా—సఖా! నీతిజ్ఞా!

గీ. పురములను గాల్చురుద్రుని పోలికగను;
ప్రళయ సమయ సముజ్జ్వల జ్వాలను పగిది;
నంగద చెలంగ నెసరేఁగు సింగమట్లు;
మండిపడుచుండె నదియేమొ మనుజవిభుఁడు.

నీతి—నయార్ణవా! నీమాట సత్యము. ఈతని ముఖపుండరీకము జేవురించి ప్రళయార్క బింబంబు డంబున నెసంగు చున్నది. నేఁ డెవ్వనినో యాత్మముగా శిక్షింపఁ గంకణము కట్టుకొని యుండవచ్చును. సన్నిధి కరుగుదము రమ్ము. అన్నియుం దేటపడును.

ఇరువురు—(సమీపించి) జయము. జయము. మహారాజ!

రాజ—మీకు మేలు కలుగును గాక. ఈపీఠములపైఁ గూరుచుండుఁడు.

మంత్రులు—దేవర యాజ్ఞాప్రకారము గావించెదము (అని కూరుచున్నారు.)

రాజ—మంత్రులారా! మీ కొకశుద్ధాంత రహస్యము తెలుప వలసియున్నది.

మంత్రులు—దేవా! ఆనతిండు.

రాజ—మన మయ్యరణ్యంబున విరోధులతో దురంబు సలుపు చున్నతఱి నిచ్చట కుమారుండు—ఛీ! వీనిని కుమారుఁడన్న మహాపాతకము సంభవించును. సారంగధరుఁడు (అనిపండ్లు పటపటఁ గొఱుకుచున్నాఁడు.)

నయా—(తనలో) ఓహో! ఈతఁడు కుమారునిమీఁద నే క్రోధము వహించినాఁడే.

నీతి—ప్రభువా! ఏమి చేసినాఁడు?

రాజ—చిత్రాంగి నగరున కెదుర నున్నవివిక్తప్రదేశంబున మిత్త్రులతోఁ బావురపుఁబన్నిదమున కుపక్రమించెనఁట.

నయా—ప్రభువా! రాజ కుమారుల కీవినోదం బొకదోషంబు గాదు.

నీతి—దేవా! అబ్బాయి గారెన్నఁడును గ్రీడాపరాయణులు గారు. ఏదియో సహవాస దోషంబున నీవినోదంబున దిగి యుండవచ్చును.

రాజ—పిమ్మట జరిగినపని వినుండు.

నయా—దేవా! సెలవిండు.

రాజ—తన కపోత మొక్కటి కాన్పింపలేదని చెలికాండ్రకుం దెలిపి వారి నొక్క-కెలన నిలిపి తా నొక్కరుండును.

గీ. నరగఁ జిత్రాంగి రాణీవాసమున కరిగి;
వావి వరుసల నెంచక బలిమిఁబట్టి;
కండ కావరమునఁ గొన్ని కాఱులాడి;
యేమొ యొనరించెనఁట పల్కు-లేల? యింక.

మంత్రులు—శివశివా! (అని చెవులు మూసికొనుచున్నారు)

నయా—మహాప్రభూ! ఎంతటి నీచాతినీచుండును జలుపఁ దెగింపనియిప్పని సుజ్ఞాననిధి యగు సారంగధరుఁడు సలిపెనన్న నాశ్చర్య మగుచున్నది.

నీతి—మహారాజ! ఇది నమ్మఁ దగిన మాట గాదు. సారంగధరుం డేమి? ఇట్టి దుష్కృత్యంబు సేయుటయేమి?

రాజ—చిత్రాంగి నగరునకు సారంగధరుండు చనె నని ప్రత్యక్షముగాఁ జూచిన తన్మిత్త్రులు వాహతక బాభ్రవ్యులే చెప్పినారు.

నయా—చనువున నొక వేళఁ జనినం జనియుండవచ్చును, తల్లుల యిండ్లకుఁ దనయులు చనుట దోసమా?

నీతి—రాజా! పదింబదిగఁ బరికింపుము, ఈవ్యవహారము నీటిలోని ముల్లు వంటిది.

రాజ—చిత్రాంగియే సారంగధరునియెడ నిందారోపణంబు చేసినదందురా?

నయా—చేసినం జేయవచ్చును.

రాజ—ఇంతకు మున్ను వీరలకుఁ బరస్పరద్వేషకారణ మెద్దియుఁ గానిపింపదే.

నయా—అతండు సపత్నీపుత్త్రుం డగుటయే గొప్ప కారణము.

గీ. మున్ను కేకయభూపాల పుత్త్రి తనదు
మగనిఁ బీడించి సవతి కొమారుఁడైన

రాము ననుపదె కాననసీమ కామె
కాతఁ డెగ్గేమి యొనరించె నధిప ! చెపుమ ?

సీతి—(తనలో) ఆదశరథునివలె నీతఁడును ముందు తీఁజనిశొందలంబు నొందుననుటకు సందియము లేదు.

రాజ—నయార్ణవా ! నీపలుకులు నేను విశ్వసింపను. ఏమన

గీ. కండక్రొవ్వున నాతండు గదిసి తన్ను
గాఢముగఁబట్టి సలిపిన గాయములను
గాయమునఁ జూపి యేడ్చె నక్క—మలవదన
కన్నుఁగవ నీరు కాల్వలై క్రమ్ముకొనఁగ.

నయా—నృపపుంగవా ! అంగనాజన మనోగతంబు తెలియుంగుట దుర్ఘటంబు. "ఆఁడుది బొంకిన గోడ పెట్టినట్లుండు, మగవాఁడు బొంకిన దడి గట్టినట్లుండు" నను నానుడి నీ వెఱుంగవా? అదియునుగాక చిత్రాంగి పణ్యాంగన గదా.

సీతి—మహారాజ ! మనసున నొకటియు ; మాటల నొకటియుఁ ; దుదకుఁ జేయున ది మఱియొకటియును బణ్యాంగనలకు నైసర్గికము.

గీ. చాపలము కన్నులనె కాదు ; చూపులందె
కాదు క్రౌర్యంబు ; కౌటిల్యగరిమ కుంత
లంబులనె కాదుసుమ్ము ; మనంబులందు
సహిత మలరారుచుండు రోసకియలకును.

దేవరకుం జూపినయంగమచ్చంబులెల్ల నామెయే కల్పించుకొని యుండవచ్చును.

రాజ—సచివులారా ! మీరు సారంగధరుని పక్షంబునఁ బక్షపాతబుద్ధులై పలుకు చున్నవారు కావున మీపలుకులు విన మనసు గొలుపకున్నది.

నయా—రాజేంద్రా ! మే మెప్పుడును బక్షపాతబుద్ధులము కాము. చిరపరిచయము గలసారంగధరుని సత్ప్రివర్తనము నెంచి యీశ్వరసాక్షికముగా మాబుద్ధికిఁ దోఁచినదియే పలుకుచున్నాము.

నీతి—నరేంద్రా! లోవిమాయ మాఁకుడు గలఁడు కాని లోకము మాయమాఁకుఁడు లేదు గదా. తనయింట నొదవిన దుశ్శీలంబును వెలిపుచ్చుకొనుట మానవంతున కుచితంబుగాదు. ముందొకనింద మిమ్ములఁ జెందకుండ నాసుందరిం బిలిపించి మాయందఱ ముందర విమర్శింపుఁడు. పిమ్మట నవసరమున్నయెడ యువరాజుగారిని గూడఁ బిలిపించి విమర్శింపవచ్చును.

నయ—దేవా! నీతిజ్ఞునిమాట లుచితముగా నున్నవి. సాక్ష్య రహితమయిన యీ యంతఃపుర రహస్యమునందలి సత్యాసత్యము లిదమిద్ధ మనినిర్ణయింప నవకాశంబు లేదు. కావున వాదిప్రతివాదివాదంబు ననుసరించి న్యాయనిరూపణంబు చేయ వలసియున్నది.

రాజ—ఇరువుర నేకకాలమం దేల విమర్శింపరాదు?

నీతి—దేవా! నేరము స్థిరపడకుండ సారంగధరకుమారుని బిలిపించుట దేవరగౌరవమున కే యనుచితము.

నయ—రాజా! ఇదివఱ కెన్నఁడు నన్నెము పున్నెము నెఱుంగని కన్నకుమారునిపై వచ్చిననేరముగాని వారివీరిపై వచ్చిన నేరము కాదు గదా.

రాజ—సచివులారా! మీ రింతదూరము చెప్పుచున్నారు కావున మీయుద్దేశము ననుసరించియే న్యాయనిర్ణయంబు గావించెద (అని వేగవంతునిఁ జూచి) వేగవంతా! మాయాజ్ఞ యని తెలిపి రాణి యగుచిత్రాంగిని దోకొనిరమ్ము.

వేగ—దేవర యాజ్ఞాప్రకారము గావించెద (అని తనలో) ఇవ్విషయమెల్ల గౌ రత్నాంగులకును; గుముద్వతీ సారంగధరులకును తెలిపి మఱి చనియెదను. రమా?
(నిష్క్రమించుచున్నాఁడు.)

రాజ—(తనలో) మంత్రులు సారంగధరునియెడ నిర్దోషిత్వము నిరూపింప నున్నారు. నే నిప్పుడు సారంగధరుని శిక్షింపకుంటినా చిత్రాంగి తప్పక ప్రాణములు విడుచును. అది ప్రాణములు విడిచెనా తప్పక నాప్రాణములు పోవును. అది లేకున్న నాకీరాజ్యభోగము లేటికి? సారంగధరుం డేటికి? కాఁబట్టి సారంగధరుని శిక్షించి నా జీవితేశ్వరి జీవంబులు నిలిపెద. అదిగో? ఆమె వచ్చుచున్నదిఁ ఆహా! ఆమె ముఖ మెంతదీనముగా నున్నది! ఆమె చెప్పినదంతయు వాస్తవము. ముమ్మాటికి వాస్తవము. సారంగధరుఁడు శిక్షార్హుఁడు.

అప్పుడు వేగవంతునితోఁ జిత్రాంగి ప్రవేశించుచున్నది.

చిత్రాంగి—(తనలో) హృదయమా! ఘోరకృత్య మని వెనుకదీయక ధైర్యస్థైర్యములఁ గలిగియుండుము. ఓయసత్యదేవతా! నీకు నమస్కారము. రాజు రచ్చకుఁ బిలిపించినాఁడు. శీఘ్రముగా సత్యదేవతా కవచమును దొడిగికొని నాజిహ్వాగ్రమున నివసింపుము. ఓదైన్యమా! కొలువు మఱియువఱకును నామొగమున వ్రేలాడుచుండుము. కన్నులారా! మీయందలి పైత్యజలం బంతయు ముంతలఁ బోసిన ట్లీసభం గురిపింపవలయు. ఓయుత్తరీయమా! నీవు సారంగధరుని శరీరంబుపై నిదివఱ కెంతశృంగారముగాఁ బ్రకాశించుచున్నను దద్విశ్వాసమంతయు నొకమూలకుఁ ద్రోచివైచి నాచేఁజిక్కితివి కావున నాతని కిప్పుడు గర్భశత్రువవై నాపక్షంబునకు విజయం బొసంగుము. (అని వేగవంతుం జూచి) వేగవంతా! రాజుగా రిప్పుడెక్కడ కొలువు సలుపుచున్నారు?

వేగ—రాణీ! నీవు ముచ్చటపడి కట్టించిన యీ రత్నఖచిత మంటపమున.

చిత్రాం—సన్నిధి కరుగుదము రమ్ము (అని సమీపించి) ప్రాణేశ్వరా! జయము, జయము.

రాజ—ప్రేయసీరాలా! నీకు శుభ మగుఁగాక. మంత్రులతో యోజించి నీపరాభవ దుఃఖంబుఁ జల్లార్చెద నని చెప్పి యుంటినిగదా. వీరె సచివులు, సర్వంబును బూసగ్రుచ్చినట్లు వక్కాణింపుము.

చిత్రాం.—(తలవంచుకొని కన్నీటితో) రాజా! నలువురిలో నన్నేల యగడు చేసెదవు?

—ప్రియురాలా! ఇందు పరులెవ్వరును లేరు.

—రాణీ! నీకు మేమన్యులము కాము. దైవము ముఖముచూచి యున్నదియున్నట్లు తెలుపుము.

నీతి—(తనలో)

గీ. ఒకని నమ్మించి; బాస వేఱొకని కిచ్చి;
యొకనితో నవ్వి; యందఱ నొక్క మొగిని
మోస మొనరించు పొత్తుల పొలఁతుకలకు
సత్యమునకును బరికింపఁ జాల దవ్వు.

చిత్రాం——అంతకు నోర్చినహృదయ మెంతకు నోర్వదు. మొన్నటి నిశీథంబున స్వజనంబెల్లఁ జెల్లాచెదరగుటంజేసి భూకాంతుం డేకాకియయ్యె ననికలంగని యులికిపడి లేచి నా పనిఁడియుప్పరిగం దనరు దక్షిణగవాక్షంబునం గూరుచుండి "ప్రాణేశ్వరా! పలువురుండియుఁ బిలిచినం బలుకుదిక్కులేక యెంత పలవించుచుంటివో కదా, దైవమా! ఎంతచేసితి" వని దుఃఖించుచుండ నా కన్నులనే ప్రభాతమయ్యెను.

రాజ——(తనలో) ఈమెకు నాయెడ నవ్యాజానురాగము గదా. కాకున్నఁ గలఁగన్న మాత్రాన నంత చింతించునా?

నీతి——(తనలో) నిజముగా నీబోగంపుటాగ చళుక్యవంశవృక్షమును మూలచ్ఛేదంబును గావించి భూనాథునిఁ బిలిచినదిక్కులేని వానినిగానే చేయఁదలఁచుకొన్నది

నయా——(తనలో) ఔరా! ఈమాయలాడి పన్నుగడ.

రాజ——తరువాత, తరువాత.

చిత్రాం——అప్పుడు ప్రభు విజయమంగళవార్తాపత్త్రికం గొని నాముద్దుల పావురపు ముద్దియ నాయొద్ద వాలెను.

రాజ——నేను పత్త్రికవ్రాసి పావురముచే ననిపినమాట సత్యము.

నీతి——తరువాత, తరువాత.

చిత్రాం——అనంతర మాపత్త్రికంగొని చదివికొని పరమానంద భరితనై యక్కపోతమును మక్కువతో లాలించుచున్నతఱి నెక్కడనుండియో చుక్కతెగి పడ్డట్టక్కడకు మఱియొక్క పావురము వచ్చివాలెను.

నయా——అది సారంగధరుని పావురమై యుండవచ్చును.

నీతి——(తనలో) కటకటా! పారావత క్రీడావ్యసన మెంతకుఁ దెచ్చినది.

రాజ——హృదయేశ్వరీ! అట్లనంతరము వచ్చినది మగపావురమా? ఆఁడు పావురమా?

చిత్రాం——మగ పావురమే.

రాజ——సచివులారా! ఈ వెడఁగుఁబడుచు గ్రహింపఁ జాలకపోయినది కాని యామాతృద్రోహి తాఁజేయఁదలఁచుకొన్న దుష్కృత్యంబునకు సూచన ముందే చేసినాఁడు.

నయా——మహారాజ! ఇంతమాత్రకే సారంగధరునియందు నిందారోపణంబు సేయుటుచితంబు గాదు. సమబుద్ధి గలిగిసర్వంబును జిత్తగింపుఁడు. హృదయమును జెదరనీకుఁడు.

నీతి—(తనలో) జారత్వ శంకాసంకలిత బుద్ధికి హితాహితజ్ఞానము శూన్యము గదా.

గీ. హృదయమున నెట్టిసందేహ మొదవి పొదలుఁ
దత్తదనురూపమున నూహ హత్తియుండుఁ
గన్నుఁగవ కద్దమెటువంటి వన్నెగలది
పెట్టికొన నట్లె జగము కాన్పించురీతి,

(ప్రకాశముగా) మహారాజ! పదింబదిగఁ బరికింపుము. ఇటుచూచిన లేకలేక యెన్నెన్నియో నోములునోమి కన్న చిన్నాతికొమరుఁడు, అటుచూచిన నీవు ప్రాణంబు ప్రాణంబుగా మన్నించు చిత్రాంగి. ప్రియాప్రియంబులు రెండును విసర్జించి ధర్మనిర్ణయంబు సేయువాఁడే న్యాయమూర్తి యని పెద్దలు పలుకుదురు.

రాజ—(మంత్రుల పలుకుల నుపేక్షించి) ప్రాణేశ్వరీ! చెప్పు చెప్పుము. అనంతర మేమి జరిగినది?

చిత్రాం—పిమ్మట నట్లు నా ప్రోల వాలినపారావతంబు నెయ్యారంబును గనుంగొనుచున్న సమయంబున నేమి చెప్పుదు.

ఉ. బంగరుదుప్పటంబు పలెవాటుగ రింగులువార వైచి; సా
రంగ మదం బలంది; దరహాసము మీసల భాసిలన్; నిజా
పాంగము లోనిరాగరస భావములన్ వెలిపుచ్చఁ జొచ్చె; సా
రంగధరావనీశజుఁడు రాజసవృత్తి మదీయసౌధమున్.

రాజ—తరువాత, తరువాత.

చిత్రాం—పిమ్మట నట్లు వచ్చినసారంగధరుం జూచి ఔచ్చపడి చేయునదిలేక చేరువందనరారు శయనగృహముం జేరి తత్కవాటంబుచాటునఁ దలఁదాఁచికొని యేచిన భయంబున నిలువంబడితి. అంత నతండు బిఱాన నఱుంజొఱంబడి కన్నులవిలుతుండు వెట్టుబన్నంబున కోపఁజాలక యెన్నెన్నియో వగల నన్నుంబొగడి తన యభిమతంబు వెలిపుచ్చి బ్రతిమాల మొదలువెట్టెను.

రాజ—తరువాత, తరువాత.

నయా—(తనలో) బోగంపుఁజానలకు బొంకులంకులు పుట్టువుతో నున్నయవియే కదా.

నీతి—(తనలో) శివశివా! ఇట్టి మాటలు విన్న పాపము సంభవించునుగదా.

చిత్రాం—రాజా! తదనంతరము నాహృదయమున నాగ్రహ మెత్తి—

ఆ. రాజు లేనివేళ రాణివాసంబును
భయములేక చొచ్చి పాపమనక
తల్లినంటుటకును దలఁచెదు; నాశరీ
రమ్ము నీదుతండ్రి సొమ్ము సుమ్ము.

అని మందలింప నమ్మందుండు కందర్పగర్వాంధుండై "సుందరీ! బోయవాని కొకదొరయును; బోగముదాని కొకవరుఁడునా?" యని యధిక్షేపించుచు; ముట్టకు ముట్టకుమని మొఱపెట్టుచున్నను సరకుగొనక సాహసంబున నాకరంబును బట్టుకొనియె. ప్రాణేశ్వరా! అప్పటి నా వెగు లయ్యీశ్వరుండె యెఱుంగు. ఇంక నా మానంబు గాచువా రెవ్వరునులేక నివ్వెఱపడి యుంటి.

రాజ—(కోపముతో) ఔరా! దురాత్మా! మాతృద్రోహీ! ఎంతఘాతుక కృత్యమున కాలాయంపడితివిరా. జీవితేశ్వరీ! పిమ్మట నేమిజరిగినది?

చిత్రాం—ధరణీశ్వరా! తరువాత నా దురాత్ముండు జరిపినదారుణకృత్యంబు లీనిండినసభ నుగ్గడింపఁ దగినవి కావు.

నయా—రాణీ! ఈవిషయమును సడిసన్నగా నెఱిఁగినవా రెవ్వరైన నున్నారా?

నీతి—(తనలో) ఇంత దారుణకల్పనమున కుపక్రమించిన పరమఘాతుకురాలికి సాక్ష్యము కుదుర్చుటన నెంత?

చిత్రాం—(తనలో) ఇవ్విషయము నెఱింగినవారి నెవ్వరెవ్వరి నెట్లు జాగ్రతపెట్టవలయునో యటు జాగ్రత పెట్టుట మేలే యైనది (ప్రకాశముగా) పరులున్న నింత పని యేలజరుగును?

రాజ—సత్యము.

నీతి—రాజేంద్రా! యువరాజుగారి ప్రవర్తనమును బట్టి యోజించినను; సాక్ష్యరహితమైన యీమె పలుకుబడినిబట్టి విమర్శించినను; నిది యంతయు నసత్యకల్పనగాఁ దోఁచుచున్నది.

ఆ. సలకసుగుణరాశి; సారంగధరుఁడె యీ
తప్పు సేయునెల్లఁ దథ్యమేని
గొడ్డురాలు గన్నబిడ్డ తామృగతృష్ణ
స్నాన మాడుటయు నిజమ్ము సుమ్ము.

నయా — మహారాజ! ఈవిషయము విశ్వాసార్హముగా లేదు.

చ. కనుఁగొనఁ డన్యకామినుల; గాటపు సిబ్బితికాఁడు; సాధు స
 జ్జన పరిరక్షకుండు; గుణసారు; డుదారుఁడు; శాంతమూర్తి నీ
 తనయుఁ; డతండె యిట్టి పెనుతప్పొనరించినయేని నింతకున్
 వననిధు లింకవే? గిరులు వ్రయ్యవె! చుక్కలు నేల వ్రాలవే?

చిత్రాం — మహారాజ! మీ మంత్రులు నా పలుకులు విశ్వసింపకున్నవారు. ఈ యుత్తరీయ మెవ్వరిదో పరిశీలింపుఁడు. (అని యుత్తరీయమును రాజుమ్రోల నిడుచున్నది).

రాజ — (చూచి నిర్విణ్ణుఁడై) ఈ యుత్తరీయము తప్పక సారంగధరునిదే యని చెఱఁగున నున్న నామాక్షరములే చెప్పుచున్నవి.

నీతి — రాణీ! సారంగధరుఁడు నీసౌధమునకు వచ్చినట్లు స్పష్టపడియెఁ గదా. అప్పుడొకవేళ మఱచినను మఱచి యుండవచ్చును.

రాజ — ఔ నౌను. నేర మెక్కడ వెలియగునో యన్నయావేగముచే మఱచియే యుండవచ్చును.

నయా — కాదు. కాదు. చిత్రాంగి వారాంగన కదా. వారాంగనా వ్యాపార మెల్ల వారికిం దెల్లంబె. కాఁబట్టి నాబుద్ధి కిట్లు తోఁచుచున్నది.

రాజ — అవహితుఁడనై యున్నాను.

నయా —

చ. జనవర! నీకుమారకుని చక్కఁదనంబును జూచిచూచి; య
 మ్మనసిజుబారి కగ్గమయి; మానినియే తమిఁ దెల్ప; నొప్పమిన్
 గనుఁగవఁ గప్ప దర్పకవికారము; పైఁబడి; యుత్తరీయమున్
 గొన; విడి; పాపభీతి మదిఁగొల్పఁగ శీఘ్రమ వచ్చె నమ్ముమీ.

రాజ — (చెవులు మూసికొని) శివశివా! ఎంత మాటాడితివి.

చిత్రాం — రాజా! ఈ దారుణ వాక్పారుష్యంబులు వినియు నాప్రాణములు పోకయున్నవి. విధాత నా హృదయమును వజ్రముతోనో; పాషాణముతోనో నిర్మించెఁ గాఁబోలు. కాకున్న నేల శతధా భిన్నము గాకయుండును?

నీతి—(తనలో) ఈ నయార్ణవుఁ డాడినమాటలే సరియై యుండవచ్చును. కాని యీ చినాలి తన నాలికుచ్చు గచ్చువగలచే నృపాలుని హృదయమును లోఁగొను చున్నది.

చిత్రాం—రాజా! మీరును మీసచివులు నొక్కటియే. ఎల్లరును యువరాజ పదంబుననున్న సారంగధరునిపక్షమే యవలంబింతురు కాని యంతలపాంతల దాన నగు నా పక్షమేల యవలంబింతురు? మీ రెట్లాహించినను సరియే. ఇంక నేను మాత్రము నలువురిలోఁ దలయెత్తికొని మెలఁగఁజాలను. శీఘ్రముగా దేవర కరవాలంబున నా శిరంబు నఱికి పరాభవదుఃఖమును జల్లార్పుఁడు. నన్ను మఱచి తమరు భార్యాపుత్రులతో సుఖింపుఁడు. (అని గోలుగోలున నేడ్చుచు రాజుపాదములమీఁదఁ బడుచున్నది).

రాజ—(తొట్రుపాటుతోఁ గన్నీరు తుడుచుచు) జీవితేశ్వరీ! మలమల మరుఁగుచున్న నా హృదయమును నీ యెత్తిపొడుపుమాటలచే మఱింత రగిలింపకుము. బహుజన పరిరక్షణ దక్షం బగునీ కౌక్షేయకం బెప్పుడు నబలాజన వధంబున కాలాయం పడనేరదని యెఱుంగుము. నా విడిచి యడలకుము. కన్నీరు దుడిచికొనుము. ముఖకమలంబును వికసింపఁ జేయుము.

నయా—(తనలో) ఈమె కన్నీటివెల్లువ భూవల్లభు నుల్లంబు నజ్ఞానాంధకార సముద్రమున కీడ్చివేసినది.

రాజ—సచివులార! మీ రేమో న్యాయశీలు రనుకొంటిని. ఇప్పటి మీ పలుకుబడి నిబట్టి చూడ దేవియైన రత్నాంగివలన నేదియో మహోపకారమును బొందఁదలఁచి సారంగధరుని పక్ష మవలంబించి నారని నే నూహించెద.

మంత్రులు—(తమలో) శివశివా! ఎంత మాట వినవలసివచ్చినది.

చిత్రాం—నాధా! సత్యము. కాకున్న నీ ద్రోల వీరు న న్నేలయంతే యలుసు చేయుదురు?

రాజ—మంత్రులారా! మీ రాక్రూరునిపక్షమున లక్ష చెప్పినను శిక్షింపక మానను. రాజశాసనము ననుసరించి యీ యంతఃపురద్రోహిని గాలుసేతులు తప్పక నఱికించెద. మాఱుపలుకక నేఁటికిఁ గొలువువిడిచి మీరు మీ గృహములకుం జనుఁడు.

మంత్రులు—మహారాజ! పరమార్థము పరిశీలించి పలికినమమ్ము లంచగొండుల మని యకారణంబ నికార మొనర్చితివి. పాప మేరూపముననైన బయలు పడకమానదు. తమకపడక పశ్చాత్తప్తుఁడవై కొంతకాలము నిదానించుట మేలు. ఇంతకు

మిక్కిలి తెలుపవలసినది లేదు. పని వినియెదము. (అని నిష్క్రమించు
చున్నారు).

చిత్రాం—(తనలో) మంత్రుల హితోపదేశమును ప్రభువు నిరాకరించునట్లు కావించి తిని గదా. పిమ్మట నీ వృద్ధరాజు బుద్ధి యెటువోయి యెటు తిరుగునో. కావున నేఁడే సారంగధరునకు శిక్ష విధించున ట్లొనరింప వలయును. హృదయమా! సారంగధరునిఁ జూడఁగానే మఱల మోహాంధకార కూపమునఁ గూలెదవు సుమా. నీ కానీటుకాని కౌఁగిలింత యేటియావలి గిలిగింత. ఇఁక నీవు జాగరూకత కలిగి తద్వినాశనమునకే యత్నింపుము (ప్రకాశముగా) నాథా! మ త్పరాభవకారి యగు నాక్రూరుని బలుమాఱు స్తుతించుచున్న సచివుల మ్రోల వినుచుటుచితంబు గా దని యొక్క విషయమును మనవి సేయలేదు.

రాజ—అవహితుఁడనై యున్నాను.

చిత్రాం—అట్లున న్నాక్రూరుండు బలాత్కరించి చనుచు "ఓసీ! చిత్రాంగీ! ముసలికిఁ జెలువ దొరకినను; గుజ్జుకుఁ గ్రొత్త వలువ దొరకినను విడుచుట దుర్ఘటము. కావున

చ. "జనకుని నొండు రెండు దివసంబులలో వధియించి; తోడనే
నినుఁగొని రాజ్యభోగముల నింపెద నిప్పటికంటె హెచ్చుగా;
వనజదళాక్షి! నే నిటకు వచ్చినవార్తలు సుబ్బకుండ నీ
మనమున నుంచుకొమ్ము; చనుమానము మాపుము; పోయివచ్చెదన్"

అని మోహాతిశయంబునఁ బలికెను. మితిమీఱిన మోహము మనుష్యులచే నెట్టిదారుణకర్మమునైనఁ జేయించుటకు వెనుకఁదీయదు. దేవర కేమి ముప్పు వచ్చునో. నా వలనఁగదా యింతలు పుట్టినవి (అని కన్నీరు నించుచున్నది).

రాజ—(పండ్లు కొఱుకుచు) ఔరా! ఎంత క్రూరకృత్యమున కుపక్రమించినాఁడు. జీవితేశ్వరీ! చింతింపకుము. ఇంతకు వచ్చినతరువాత నా దురాత్ము నుపేక్షింతు ననుకొంటివా? నేఁటి నిశీథంబుననే ఘోరతరారణ్యప్రదేశంబునఁ గాలు సేతులు నఱుక నుత్తరు వొనరించెద. అచ్చట వేదనచేఁ బరితపించు నామాతృద్రోహి నేఘాతుకమృగమైన మ్రింగక మానదు.

చిత్రాం—ఒకవేళ నాయువుండి బ్రదికినయెడ

రాజ——వెఱ్ఱిదానా! ఆ పిచ్చుకుంటు మనల నేమిసేయఁగలఁడు? (అని వేగవంతునిఁ జూచి) ఓరీ వేగవంతా! నా మనోధనం బగుచిత్రాంగి సన్నిధినే సారంగధరునకు శిక్ష విధింపవలయును. నీవుపోయి తలారుల కిట్లు తెలుపవలయు.

వేగ——దేవా! ఏమని.

రాజ——"సారంగధరుం గట్టి వధ్యచిహ్నములతో మాసన్నిధికిం దోడ్కొనిరండు" అని.

వేగ——దేవర యాజ్ఞాప్రకారము గావించెద (అని తనలో) పూజ్యురా లగుగౌతమీ ద్వితీయ యగుదేవిగారి కీదారుణసభావిశేషంబులెల్ల వివరించి మఱిచనియెద (అని నిష్క్రమించుచున్నాఁడు)

చిత్రాం——జీవితేశ్వరా! మీ రేదిచెప్పిన నది యెల్ల సులభముగా నమ్మెడుస్వభావము గలవారు. ఇప్పుడు రత్నాంగి వచ్చి యేవియోకొన్ని కల్ల బొల్లులల్లి కన్నీటివెల్లు వలచేఁ బదపల్లవములం దడుపుచుఁ బుత్రభిక్ష పెట్టు మనిదీనాతిదీనంబుగాఁ బ్రార్థించినయెడ మీ మనసు కరఁగి తిరిగి పుత్రవ్యామోహంబున దిగకుండునా?

రాజ——వాఁడు నాకు గర్భశత్రుఁడు గాని పుత్రుఁడా?

చిత్రాం——రత్నాంగివలని చిరతరస్నేహ మైన యోజింప కుందురా?

రాజ——దాని నిదివఱకే తెగఁగోసివేసితి నని నీవెఱుంగవా?

గౌతమి——(తెఱలో) దేవీ! ఊఱడిల్లుము. ఊఱడిల్లుము. మాహేశ్వర వరప్రసాదాతిశయంబున జనియించిన నీ తనయున కెప్పటికి నెుకహాని సంభవింపనేరదు. అతఁడు చెప్పినదంతయు సత్యము.

రత్నాంగి——(తెఱలో) అమ్మా! గౌతమీ! న్యాయాన్యాయంబులు పరికింపక కన్నతండ్రియే చిన్నికొమారుని మారణంబు సేయనున్నప్పుడే నెట్లూఱడిల్లి యుండఁ గలుగుదు.

చిత్రాం——అదిగో! పూజ్యురా లగుగౌతమిని వెంటనిడికొని తనతనయుఁడు నిర్దోషి యని మొఱపెట్టుకొనుటకై రత్నాంగి వచ్చుచున్నది. నా పరాభవదుఃఖమును మఱువకుఁడు. వేయేల? ఈచిత్రాంగియే మీకు నిజముగాఁ బ్రాణసమాన యైన యెడఁ దమహృదయము స్వజనంబు మీఁదికిఁ దిరుగకుండుటయే సాక్షి.

రాజ——దేవీ! మాటిమాటికి నుపదేశింపవలయునా? నీ పరాభవదుఃఖము నా పరాభవదుఃఖము గాదా? నన్నుఁ జంపి నిన్నుఁ జేపట్టఁ దలఁచినక్రూరుఁడు నా కెక్క

డికుమారుఁడు ? అట్టి వానితల్లి నా కెట్టియిల్లాలు ? ఇట్టి యుల్లకుట్టుమాట లాడి నా యుల్లంబును మఱింత వేధింపకుము.

(అప్పుడు రత్నాంగియు; గౌతమియుఁ బ్రవేశించుచున్నారు.)

గౌత—దేవీ! ఊఱడిల్లుము, ఊఱడిల్లుము. మాహేశ్వర వరప్రసాదాతిశయంబున జనియించిన నీ తనయున కెప్పటికి నొకహాని సంభవింపనేరదు. అతడు చెప్పిన దంతయుం సత్యము.

గీ. పడఁతిరో! తొల్లి యుత్తానపాదవిభుఁడు
సవతిపలుకులు చెవినిడి ధ్రువకుమారుఁ
దొడలపైనుండి వెడలంగనడప నతఁడు
కెడసెనే? యున్నతస్థితిఁ బడసెఁగాక.

అట్టి సుగుణనిధిని దండ్రి శిక్షించినను దైవము రక్షింపక మానఁడు. ఆధ్రువునిచందంబుననే నీనందనుండును బ్రహ్మానందస్థితిని బొంది మఱల నీకన్నుల కానందము గలిగింపఁగలఁడు.

రత్నాం—ఆ చండతరాటవి నేపుండరీకమైన మ్రింగకుండునా ?

గౌత—దేవీ ! అట్లనకుము. ఏసిద్ధుఁడైనవచ్చి రక్షించినను రక్షింపవచ్చును.

రత్నాం—అట్టి భాగ్య మీనిర్భాగ్యురాలికా లభించుట ? అమ్మా ! జీవితేశ్వరు శక్కడ ?

గౌత—ఇదిగో ! చిత్రాంగితో నీకొలువుకూటంబుననే కూరుచున్నవాఁడు. సన్నిధి కరుగుదము రమ్ము.

రత్నాం—అలాగునే (అని గౌతమితో సమీపించి) ప్రాణేశ్వరా! జయము, జయము.

రాజ—(వెడమొగము పెట్టుకొని గౌతమివంక మాత్రమే చూచి) పూజ్యురాలా! నీకు వందనము.

గౌత—రాజా ! నీకు స్వస్తియగుఁగాక.

రత్నాం—(తనలో) హా ! ప్రాణేశ్వరుఁడు నా మొగముఁజూచి మాఱుమొగము పెట్టుకొనియె. ఇఁకఁ జేయవలసినదేమి ? ఇంతకును గారణము చిత్రాంగియే కదా (ప్రకాశముగా) అమ్మా! గౌతమీ!

సీ. ప్రాణనాధుని కృపాపాత్రలై మిక్కిలి
వాసిని గాంచినవారు లేరె
వెలపూవుబోండ్లలోఁ గొలపుఁజేడెలకంటె
మేరగా మెలఁగినవారు లేరె
సవతులపట్ల మచ్చరమింత పూనక
కూరిమి మెయిఁ జూచువారు లేరె
పినతల్లులిండ్లకుఁ దనయులుచనుదేర
గారాబమున నేలువారు లేరె
అకట! గుణరాశియైన సారంగధరుని
మీఁద నొకటికిఁబదియాఱు మిషలుపన్ని
యినునకెగఁబోసి శిక్ష సేయింపఁ గడఁగె
యాత్మజప్రేమ విడిచి చిత్రాంగి నేఁడు.

గౌత— దేవీ! చెప్పెడువా రెట్లుచెప్పినను వినియెడువారైనను బరిజనపరివృతంబగు శుద్ధాంతంబున నింతటిదురంతకర్మంబు సారంగధరు నంతటినీతిమంతుఁడు పట్టపగ లెట్లుజరిపియుండునా యనువిషయమమాత్రము విచారింపఁదగినది.

చిత్రాం—(తనలో) ఈగౌతమి చెలిమిని దొలుతనే విడనాడుకొనుట మంచిదే యైనది (ప్రకాశముగా) పూజ్యురాలా! గౌతమీ!

ఆ. ఒరులకంటె ఘనత నొందఁగావలెనను
నాస మానసమ్ము నావరింపఁ
దనదునడత మఱచి ఘననీతివాక్యంబు
లాడ నీతిమంతుఁ డొనెనరుఁడు.

అమాత్యద్రోహి యెంతనీతిమంతుఁడో యిప్పుడెల్లఱకుం దెల్లంబె. మీవలె భ్రాంతి పడి సారంగధరుఁ డేమో గుణవంతుఁడని యేమఱుపాటునఁ బరిజనులు తమతమ ఘనులకుం జనిరి. పలుపలుకులేల? అంతటి మానభంగము సంభవించినందుల కే

నూతనో కూలి ప్రాణంబులు విడువక యింకను మొండినై జీవించియున్నదాన. ఇసీ! నాబ్రదుకేల? కాలుపనా? (అని కన్నీరు నించుచున్నది.)

రత్నాం—(తనలో) ఓసిజెంతా! ఎంతటి కెత్తుకొంటివే (ప్రకాశముగా) అమ్మా! గౌతమీ! పెంప నోపినపినతల్లియని తప్పిపోయినపావురము నడుగం జనినతనయుం గామించి మర్యాదేతరప్రసంగంబు జరుప నదివినసహింపక లేచివచ్చుచుండ మచ్చరంబున నుత్తరీయంబు గొని; యంగంబునఁ గొన్నియంగమచ్చంబులు గావించుకొని; సదయం బగుతనిహృదయంబు నదయంబు గావించి; నందనుని నిందాస్పదుంజేసి; దారుణశిక్ష కగ్గ మొనరించినపరమఘాతుకురాలు; దుర్మార్గురాలు; తుచ్ఛురాలు; బిడ్డలులేని గొడ్డురాలు; పరమవంచకురాలు మఱింకైనఁగలదా? ఒక్కవారాంగన కల్లనూరిమిచూపి చెవికొఱికినమాత్రానఁ బరవశత్వంబుచెంది సత్యాసత్య పరిశీలనారహితుండై రూపనిర్జితమారుం డగుకుమారు కాలు సేతులు నఱికింపఁ గంకణము కట్టుకొన్నతండ్రుఁ డింకైనఁగలరా?

గౌత—(తనలో) అహా! రాజులకుఁ జెవులేకన్నులు గదా.

రాజ—తల్లింజెఱిపి తండ్రిని నఱుకనున్నమహాపాతకిం గన్న నిన్ను నీవే నిందించుకొమ్ము. ఇక్కడ నెవ్వరి నిందించెదవు?

చిత్రాం—(కోపముతో) రత్నాంగీ! ఎన్నెన్నియో వగల నన్నుదూఱుచు; నిక్కుచు; నీలుగుచు; విఱ్ఱవీఁగుచుఁ "గొడు కేమియు నెఱుంగఁడు; సాదుబిడ్డఁ" డని నేరపుమాటలఁ దేలఁబలికి చక్కట్లు దిద్దుచుంటివా? ఎంతటి నంగనాచివే. ఇచ్చట ప్రేళ్లసందుల జాఱునంతటి యంచేద లెవ్వరును లేరు. ఊరక పెద్దఱికాలు పచరించి వాదులాడకుము. నీ యీబజాఱిరంతు లెవ్వరు మెత్తురు? పిన్నతల్లి నంటినచెన్నఁటి నోర ప్రేలిదఁ గఱువఁజాలని పిన్నపాపఁడా? చాలుఁజాలు. బాలుండు బాలుం డని తేలనాడుచుంటివి కాని యాదుశ్శీలుండు నాపాలికి వచ్చి సలిపినదుష్కృత్యము నెంచకున్నావు. ఔరా! ఎవ్వరును గాశికిఁ బోయినసుద్దులే ప్రకటింతురు కాని నడుమ చేసినదోసంబు లెంచరు కదా.

గౌత—(తనలో) అంతరు వెఱుంగక యీసంతమెఱుఁగులాఁడి యెంతనీచముగ్గా ప్రసంగించుచున్నది!

రత్నాం—(తనలో) ఈచినాలి నాలిగాఁ గొనిమేలుపడినభూపాలు ననవలయుం గాని యొరుల ననవలసినపని లేదుఁ (ప్రకాశముగా) ప్రాణేశ్వరా! వారాంగనలం జేరఁదీసినవారు లేరా? వారల కపారధనంబు లిచ్చినవారు లేరా? నీవలె నెవ్వరైన

లంజియమాటలు నమ్మికొమరుని నఱికిక్కొనిరా? ఇదేటిదొరతనము? ఇదేటిన్యాయము? కాసున కాసించి; లజ్జనుబరిత్యజించి; కుంటివానికిని; గ్రుడ్డివానికిని; గూనివానికిని; కుష్ఠురోగికినిగూడ నడువీధి నొడలమ్ముకొనువారకాంత కుమారుంగా మించె నన నేమివింత? వేశ్య కేటి వావివరుసలు? తమకపడక చక్కగా విచారింపుము.

గౌత—(తనలో) చిత్రాంగి వాగౌషధ మీతని తలకెక్కి యాడించుచున్నప్పు డెవ్వ రేమి చెప్పినను బ్రయోజనము లేదు. కామాతురులు పరవశాత్ములు గదా. అయినను నాశక్తికొలంది బోధించిచూచెద (ప్రకాశముగా.)

ఆ. ఇచ్చకంబు లాడ నిటువంటి వెలవాలు
గంట్ల వేనవేల గడనసేయ
వచ్చుఁ గాని యట్టి వరగుణాకరుఁ బుత్త్రు
గడనసేయలేవు పుడమిఱేఁడ!

రాజ—చేయ రానినేరమును జేసినయామహాపాతకుని మీరు లక్షచెప్పినను శిక్షింపక మానను. వాఁడు నాప్రాణములకే యెసరు వెట్టఁదలఁచినాఁడు. ఇట్టివాఁడు నాకు మారకుండు గాని కుమారకుండు గాఁడు. అదియునుగాక నేరము చేసినవాఁడు బొట్టె యైనను సరే. చుట్టమైనను సరే. దండించుట ధరణీశులకుఁ గర్తవ్యము. కాఁబట్టి నేఁటి నిశీథంబుననే వాని కాలు సేతులు నఱికించి తెప్పించి చిత్రాంగికి నేత్రోత్సవంబు గావించెద.

చిత్రాం—(తనలో) నాకోరిక యెంతత్వరలో ఫలించిన నంతసంతసించెద. వీర లెన్ని కాకులు ప్రేలినను లక్ష్యముచేయక యూరకుండెద.

గౌత—ప్రభువా! నేఁటి నిశీథముననే? వంటయింటి కుక్కుటమును సహితము కొన్నాళ్లు చూడకుండఁ గోసివేయరు గదా. ఇదేమి యన్యాయము? మోహాంధుండవై కటికవాఁడుసహితము పూనని వ్యాపార మవలంబించుచున్నావు. కొన్నాళ్లు తాళుము. తథ్యము బయలుపడును.

రాజ—మాశాసనము ననుసరించి యెంతమాత్రము తాళము.

రత్నాం—ప్రాణేశ్వరా! రాచసిరు లింతటితోఁ జాలు. కోడలును; నేనునుంగూడఁ జనియెదము. అడవులకైనఁ బంపుము. ఆకలము లేరికొని తిని బ్రదికెదము.

రాజ—మాశాసనంబును వీసంబేని యతిక్రమించువారము కాము. నీవేమిపలికినను నాతోడుసుమీ. అంతిపురంబునకుం జనుము.

రత్నాం—(తనలో) ప్రాణేశ్వరు నెంత ప్రార్థించినను ప్రయోజనము లేదు. ఇఁక నేమి గతి?

చ. ఎవనిని జూచికొంచుఁ దను వీగతి నిల్పితి; సర్వభాగ్య మే
నెవనికతంబునం గనఁగ నెంచితి; దుఃఖము లెన్ని వచ్చి హృ
ద్వివరము నాశ్రయించినను వీసము లక్ష్యము సేయనైతి నే
నెవని హితోపదేశమున; నీశ్వర! యట్టికుమారు మ్రింగెదే?

(ప్రకాశముగాఁ గన్నీటితో నెలుఁగెత్తి) హాకుమారా! సారంగధరా! హృదయ పద్మాధిష్ఠిత సారంగధరా! ముఖకమల వినిర్జిత సారంగధరా! దైవము నేఁటితో నీకును నాకును ఋణానుబంధమును దీర్చెనా?

(తెఱలో సారంగధరుఁడు) అమ్మా! ఊరడిల్లుము. ఊరడిల్లుము. మఱణ మెన్నటికైన నున్నదియే. నా విధివిపాకంబున నిప్పుడు సత్యదేవత మఱుఁగువడినను నిలుకడ మీఁద వెలువడక పోదు. ప్రస్తుతము మాతృద్రోహి యనిపించుకొనవలసి వచ్చెఁగదా యని మాత్రము విచారించుచున్నాను.

చిత్రాం—(ప్రభువుతో జనాంతికముగా) అదిగో! తలారు లాఘాతుకునిం గొని వచ్చుచున్నారు. మీరు శీఘ్రముగా శిక్ష విధింపవలయును.

అప్పుడు ఘటక వక్రచిత్తులతో సారంగధరుఁడు
ప్రవేశించుచున్నాఁడు.

వక్ర—ఓరీ ఘటకా! కాలు సేతులు నఱికినతరువాత మనుష్యుఁడు బ్రదుకునా?

ఘట—ఓరీ వక్రచిత్తా! నీ కీవెఱ్ఱియేమి? మూఁడువంతులు బ్రదుకఁడు. ఒకవేళ నాయువుండి బ్రదికినను నట్టివాఁడు చచ్చినవానితోడనే సమానము.

వక్ర—కటకటా! జేనెఁడుపొట్టకై జారశిఖామణి యగుధారుణీశ్వరుకడఁ గొలువు కుదిరి శూరశిఖామణి యగుసారంగధరుని హింసింపవలసి వచ్చెఁగదా, ఓకదుష్టా! నీవవయవములకు దొరవై నరులచే నెట్టినీచాతినీచకర్మలైనఁ జేయింతువుగదా, ఒక్క మాకే కాదు. సర్వసంగపరిత్యాగు లగుయోగులకును నీవు గర్భశత్రుఁడవే.

ఘట—ఓరీ వక్రచిత్తా; ఇంతమందిని జంపితిని గాని యెప్పుడు నాహృదయమున జాలికలుగలేదురా. అదేమో కాని యీయనపట్ల సదయం బగుచున్నది.

వక్ర—ఓరీఘటకా! నాకుఁ గన్నీరు వెల్లువలై పాఱుచున్నది చూడు. మన మేమి చేయఁ గలము. పాపపుణ్యములు రెండును భూపాలునివే. ఈ యువరాజును గొలువుకూటమునకుఁ దీసికొనిపోవుదము రమ్ము.

రత్నాం—అమ్మా! గౌతమీ! నీలిచల్లడంబుల డంబు క్రొత్తచీఁకటులు గలిగింపఁ; గోరమీసంబులపైఁ గోపదేవత తాండవింప; మృత్యు దంష్ట్రింబులంబోలు కరవాలంబులు భుజాగ్రంబుల మెఱయ; గదాదండంబులు కేలంగ్రాల; నిదిగో! తలారులు కుమారుని వధ్యచిహ్నంబులతోఁ దోడ్కొని వచ్చుచున్నారు, నే నెట్లు చూడఁ గలుగుదు. హా కుమారా! సారంగధరా! (అని మూర్ఛిల్లుచున్నది)

గౌత—(శీతలోపచారముల నొనర్చుచున్నది)

(సారంగధరుఁడు తలారులతోఁ బ్రవేశించి) తండ్రీ! నమస్కారము.

రాజ—ఓరీ దురాత్మా! నేను నీకుఁ దండ్రినిగాను. నీవు నాకుఁ బుత్రుడవును గావు.

సారం—తండ్రీ! సత్యాసత్యము లరయకుండ నాయెడఁ దమ కంతయాగ్రహ మేల కలుగవలయు?

రాజ—ఛీ! మాతృతల్పగా! పితృద్రోహీ! అన్నియు నరసినారము. పిట్టకనిమిష పెట్టుకొని చిత్రాంగిసౌధముం జొచ్చి యామెను బలాత్కరించి పాఱివచ్చితి వని మేము విశ్వసించినారము.

సారం—తండ్రీ! అట్లుకాదు. ఆమె బలాత్కరింపఁ బాఱివచ్చితి.

రాజ—నీ యుత్తరీయమే సత్యమును వెలిచేసినది. ఛీ! నీమొగము చూడరాదు. నన్నుఁ గూడఁ జంప శపథము చేసితివఁట, నీ వెంతకైనం జాలుదువురా.

సారం—శివశివా! (అని చెవులు మూసికొని తనలో) జాయమాటలే న్యాయం బని నమ్మి తప్పెఱుంగనినన్నుఁ దండ్రియే దండింపనున్నప్పుడిఁక నేఁజేయవలసినదేమి? అయ్యో? నా యవస్థఁ జూచి తల్లిగారు మూర్ఛిల్లిరి గదా.

చిత్రాం—(తనలో) రక్తమాల్యాంబర ధారియైన సారంగధరునిఁ జూడఁ గలిగితి. ఇప్పుడుగదా నాకు నేత్రోత్సవము. ఓరీ! దిక్కుమాలిన సారంగధరా! నా కోరిక కంగీకరింపక యిట్టివినాశంబును దెచ్చికొంటివి గదా.

గౌత—(తనలో) ఓమోసములమారి చిత్రాంగీ! ఇప్పుడు నీకన్నులు చల్లఁబడినవా? నీ కడుపునఁ బాలువోసి నట్లున్నదిగదా. (ప్రకాశముగా) దేవీ! లెమ్ము. ప్రభువు తీరుపు చెప్పుచున్నాఁడు. ఇఁకఁ జూడఁబోయి చూడఁబోయి కుమారుని జూడఁ బోవుకదా. కన్నకడుపు గావున నిప్పుడే యొకసారి కన్నారఁ జూచికొనుము.

రత్నాం—(మూర్ఛఁదేఱి సారంగధరుని విలోకించి పరవశయై) హా కుమారరత్నమా! బహురత్న భూషణ విభూషితంబు లగునీబాహువల్లరుల ముప్పిరిత్రాళ్లం గట్టినవా రెవరు? సారంగమదశ్రీ రమ్యం బగునీశరీరంబునఁ గెందూళి గ్రమ్ముటకుం గతం బేమి? సిబికావతంస విరాజితం బగునీచరణసరోజాతంబుల కీ తొట్రుపాటేల కలిగె? చంపకదామంబులచే సొంపు నింపెడునీకురు లేల జీరాడుచుండె? ఈ కరవీరదామంబు లెచ్చటివి? నీ కీరక్తవస్త్రంబు లెవ్వరలంకరించిరి? కడుపు దరికొన్ని పోవుచున్నది. ఎట్లోర్తురా తండ్రీ!

చిత్రాం—(రాజుతో జనాంతికముగా) రత్నాంగి తన కరుణారసగ్రంథము విప్పినది. తమకు జాలి పుట్టునేమో.

రాజ—(మఱల జనాంతికముగా) ఈవిషయమున జాలి నిదివఱకె నిర్మూలనంబు చేసితిని. కన్నకడుపు గావున దుఃఖావేశ పరవశత్వంబునఁ బ్రేలుకొను దానితోడిదేమి?

గౌత—దేవీ! నీవెఱుఁగని దేమున్నది? ఊఁ అడిల్లుము - ఊఁ అడిల్లుము.

సారం—అమ్మా! నా విధి కెవ్వ రేమి సేయఁగలరు? ఊఁ అడిల్లుము.

రాజ—ఓరీ తలారులారా! మా యాజ్ఞ వినుండు.

తలా—సామీ! చేతులు కట్టుకొని యున్నాము.

రాజ—“మాతృద్రోహము చేసిననేరమునకై సారంగధరుని కాలు సేతులునఱుకఁ ప్రభువుశాసించె” నని వీధివీధులం జాటింపవలయు.

రత్నాం—అయ్యో! ఎంతకష్ట మెంత కష్టము. రత్నసింహాసనాసీనుఁడై రాజ్యము చేయఁదగినరాజకుమారునా గుడికి వేఁటపోతును దీసికొనిపోవునట్లు వీధివీధిం ద్రిప్పుట? హా కుమారా! కన్నతండ్రీ! ఎన్నెన్నియో నోములు నోమి; కన్నకన్న వేలుపుల కెఱఁగి; నిన్నుంగని; యిన్నినాళ్లను బెంచుట చిత్రాంగీనామక మహామారిణీదేవత కప్పగించుటకా? అయ్యో! నా ప్రాణంబు లింకను బోకున్నవి.

సారం—అమ్మా! ఊఁ అడిల్లుము. ఆ విషయమున వేఁటపో తెంతదోషియో; యీ విషయమున నేనును నంత దోషినే.

రాజ—తలారులారా! తరువాత జరుపవలసిన విధానము వినుండు.

తలా—దేవా! ఆజ్ఞాపింపుఁడు.

రాజ—అట్లు చాటించి నేఁటి నిశీథసమయంబుననే కాలు సేతులు నఱుకునది.

చిత్రాం—అట్లు కాదు. నటికి మాకుఁ జూపింపవలయు.

తలా—దేవా! దేవీ! తమ యాజ్ఞాప్రకారము గావించెదము.

గౌత—(తనలో) ఔరా! వెలయాలి చలపాదితనము!

రత్నాం—(కన్నీటితో) హా జీవవాయువులారా! ఇటువంటివజ్రకఠినమైన మాటలు వినియు మీ రింకను శరీరంబువిడిచి యేల తొలఁగిపోకున్నవారు? హా కుమారా! సారంగధరా! చళుక్యకుల పావనుండవై ప్రజలఁ బాలింతువనుకొంటిఁ గాని యిట్టి దుర్దశ సంప్రాప్త మగునని కలనైన నెఱుంగనైతి. ఆపన్నజనరక్షణ ప్రశస్తంబు లగునీహస్తంబులు తలవరుల కఱకు కరవాలంబుల కెరగా నొసంగవలసి వచ్చెఁగదా. హా తనయా! నావంటి నిర్భాగ్యురాలికిఁ బొడమక మఱియెవ్వతెకైనం బొడమిన నీ కిట్టిదారుణదండనంబు సంభవింపదు గదా. కోడలిఁ గుముద్వతి నేమని యూఱడింతును?

సారం—(తనలో) అయ్యో! ఈమె కుముద్వతిపేరు స్మరణకుఁదెచ్చి నాహృదయమునకు దుఃఖము గలిగించుచున్నది. హా హృదయేశ్వరీ! మద్విరహంబునకు సహింపఁజాలక నీవు తప్పక ప్రాణములు విడిచెదవు. ఆ క్లిన్నటికిం జలుపకుమా (ప్రకాశముగా) అమ్మా! ఊఱడిల్లుము. శరీరము లనిత్యములు. లోకసుఖంబులు శోకమూలంబులు. జననమరణంబులు దేహధారులకు స్వభావసిద్ధంబులు. ఇంతయు నెఱింగి దుఃఖంబును మఱువుము. సత్యము నెన్నటికైన సర్వేశ్వరుఁడు బయలు పఱుపకమానఁడు. కావునఁ బ్రభువు పశ్చాత్తప్తుఁడగుకాలమువచ్చువఱకు నోరిమి వహించి దినంబు లెట్లెట్లో నెట్టుచుండుము, నన్ను మఱువుము. సపత్నియెడ ననువర్తనగలిగి ప్రవర్తింపుము. (అని గౌతమివంకఁ జూచి) అమ్మా! గౌతమీ! నీ భర్తురా లగుకుముద్వతితో నా పలుకులుగా నిట్లుపలుకుము.

గౌత—కుమారా! ఏమని.

సారం—

చ. "చెలువరొ! నిన్నుఁ గౌగిటను జేర్చుకరంబులు; నీవు భక్తిపెం
పలరఁగ నొత్తుపాదములు; నయ్యకు నర్పణ మాచరించితిన్;
బులుఁగులఁ బెంచినట్టియఘమున్; మఱి పోవఁగ రానితావులన్
మెలఁగినపాతకంబు నను మేకొనుటన్ వగఁ గుందఁబోకుమా.

గౌత—కుమారా! ఇంతకన్న నీయందు మఱియొకదోస మేమున్నది? తరువాత.

సారం—

చ. విరహముచే శరీరమును నీడక; లోకసుఖంబులెల్లన
స్థిరమని విశ్వసించి; యొకదివ్యమఠంబునఁ జేరి శాంతవై;

పరము ; నిరంజనున్ ; సకలపాపవిమోచను నెమ్మనంబునన్
స్మరణ యొనర్చికొంచు దివసంబులు నెట్టుము మానినీమణీ. అని,

గౌత—కుమారా! నీ నుడివినచొప్పునఁ దప్పక చెప్పెద.

సారం—(తండ్రివంకఁ జూచి) తండ్రీ! మృత్యుముఖంబునకుఁ జనుచుంటిఁ గావున నా యెడ నాగ్రహంబు విడువుము. నాకై దురపిల్లెడు నా తల్లిని మఱింతదుఃఖ పెట్టకుము. మఱియు నా కొక్క వరముఁ బ్రసాదింపవలయు.

రాజ—అదియెట్టిది?

సారం—గీ. కాలుసేతులుమాత్రమే ఖండనంబు
సలుప విధియించి యఱచావు చంపుకంటెఁ
దలనె నఱికింపుమయ్య యుత్తలము దీఱ
నీ కుమారునిపై నింత నెనరుపూని.

రాజ—ఓరీ దురాత్మా! మేము తొలుత చేసినశాసనంబును మఱల మార్చువారము కాము. (అని తలారులం జూచి) ఓరీ తలారులారా! ఈ ద్రోహి మొగంబు చూచినఁకొలది నా మొడలు బగ్గున మండుచున్నది. వీనిని శీఘ్రముగాఁ దోఁకొని పోయి మీ పనిని మీరు నిర్వహింపుఁడు.

తలా—దేవర యాజ్ఞాప్రకారము గావించెదము (అని సారంగధరుని దీసికొని పోవుచున్నారు.)

రత్నా—(కుమారునిఁ గౌఁగిలించుకొని) హా కుమారా! హా సారంగధరా! కన్న తండ్రీ! ఇన్నిదినంబులును నిన్నుఁ గొండగాఁ జూచికొని సర్వదుఃఖంబులు మఱచి యుంటి. ఈ విట్టులయిన నే నెట్లుప్రాణంబులు నిలుపుదు? హా పుత్రా! నేనును వచ్చెద. తోకొనిపొమ్ము. ఈవు లేనిబ్రదుకు నా కేమిటికి? (అని మూర్ఛిల్లుచున్నది.)

ఘట—ఓరీ వక్రచిత్తా! ఈయమ్మ మూర్ఛదేఱకముందే మనము యువరాజుం దోడ్కొని పోదము.

వక్ర—ఆలాగుననే (అని సారంగధరునిఁ దీసికొనిపోవుచున్నారు)

రాజ—పూజ్యురాలా! గౌతమీ! మూర్ఛఁ దేఱకముందే యీమెను మా సన్నిధినుండి తోకొనిపొమ్ము.

గౌత—రాజా! నీయాజ్ఞాప్రకారము గావించెద (అని రత్నాంగిని దోకొనిపోవుచున్నది)

వక్ర—(సారంగధరుని దోకొనిపోవుచు) ఓయీ సారంగధరా! ఇటువంటి ఘోర విపత్తు సంభవించినను నీహృదయంబు చలింపకుండుట మిగులనాశ్చర్యముగా నున్నది. కతంబేమి?

సారం—నా నిర్దోషిత్వమే నా హృదయమునకుఁ దగినధైర్య మొసఁగి మరణదుఃఖమును మఱపునకుఁ దెచ్చుచున్నది.

ఘట—యువరాజా! నీకు నెకవేళ మరణము సంభవించినను నీ మరణము గానంబు సేయుచుఁ బ్రాణంబులు విడుచురాయంచ మరణంబును బురణించును గాక.

వక్ర—ఓరీ ఘటకా! సౌధాగ్రములనుండి పౌరనారీమణులు సారంగధరుని దుర్వారతరావస్థను దలఁచి వేఁడికన్నీటిదార లెట్లుకురియించుచున్నారో చూడు.

ఘట—ఓరీ వక్రచిత్తా! మనము నిజముగా నీరాజమహేంద్రపుర కల్పవృక్షమును నఱుకుచున్నాముగా.

వక్ర—సందేహ మేమి? చిత్రాంగి నఱికినకాలు సేతులు తనకుఁ జూపవలె నన్నదిగదా. దీని చలపాదితనము కాల. కూరగా వండించునా యేమి?

ఘట—కాదు. కాదు. రత్నాంగి మనకులంచమిచ్చి కుమారుని విడిపించుకొనునని.

వక్ర—ఇసీ! ఇట్టిపని మనయింటికుక్కకైనను లేదు.

ఘట—ఓరీ వక్రచిత్తా! మన మాలస్యము చేసినయెడ నావల చిత్రాంగి నిప్పులు కురిపించును. కాఁబట్టి మనపనిని మనము నెఱవేర్తము రమ్ము.

వక్ర—రాజశాసనము దాటఁగూడనిది గదా. సారంగధరా! రమ్ము (అని తీసికొని పోవుచున్నారు)

రాజ—ప్రాణేశ్వరీ! నీ పరాభవదుఃఖము చల్లారెనా?

చిత్రాం—ప్రాణేశ్వరా! ఇంతట తీఱెనా? రత్నాంగీకుముద్వతులు నామీఁద నేమి కుట్రలు పన్నుదురో.

రాజ—రాజరాజనరేంద్రుం డొరులకుట్రలకు లోనై మోసపోవునంతటి మూర్ఖుఁడు కాఁడు. ఆచింత దక్కుము.

గౌత—(తెలఁ జిమ్ముకొనుచుఁ బ్రవేశించి) హారాజా! ఎంతకష్ట మెంతకష్టము.

రాజ—అమ్మా! అదియెట్టిది?

గౌత—

గీ. వరుని దురవస్థవిని కుముద్వతి శరీర
మటమటించుచు గౌతమి కప్పగించె

చిత్రాం—కుముద్వతి కడతేఱెనా?

గౌత—మ ఱేమి?

చిత్రాం—మేలు కుముద్వతీ! మేలు. మాతృద్రోహిభార్య యని బ్రదికియున్నంత కాలము నిందఁబడుటకంటె శరీరమును గోదావరికి సమర్పించుటయే యుత్తమకృత్యము.

రాజ—(తనలో) హాకోడలా! ఆనీచునికతంబునఁ గదా నీ కిట్టిదుర్మరణంబు సంభవిల్లినది.

గౌత—రాజా! అనంతరము వినుము.

రాజ—అమ్మా! అవహితుఁడనై యున్నాను.

గౌత—

కోడలి యవస్థ కెంతయుఁ గుందికుంది
యల్లరత్నాంగిదేవి తా నట్లచేసె.

రాజ—మంచిపని చేసినది. ఆమెపై ననురాగ మింతకుఁబూర్వమే వదలికొనినారము.

చిత్రాం—(తనలో) ఇక్కడకుఁ దొడుసువాసినది. ఇంక రాజునకు గాజులుతొడిగించి యీ రాజ్యమంతయు నిష్కంటకముగా నేనే పాలించెద.

గౌత—రాజా! ఇంక నేను మా గురునాశ్రమంబునకుఁ జనియెద.

రాజ—అమ్మా! అప్పుడప్పుడు దర్శనము దయసేయుచుండుఁడు.

గౌత—నీ కోరిక కే నంగీకరించితి (తనలో) ఇంక నేను వాహాతకబాంధవ్యులపై నొకకన్నువైచి ప్రచ్ఛన్నముగా నుండెద (అని నిష్క్రమించుచున్నది)

రాజ—వేగవంతా! సాయంతన మగుచున్నది. అంతిపురికిం దారి చూపుము.

వేగ—దేవా! దేవీ! ఇటు. ఇటు.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది చతుర్థాంకము.

శ్రీరస్తు.

# కుముద్వతీ సారంగధరము.

## పంచమాంకము.

ప్రదేశము—పురవీధి.

[ఘోరకుఁడను భటుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

గీ. దుష్టు లోకనాంతకాల ముద్యోగులగుచుఁ
బలువురను యోగ్యతములను బాధపఱిచి
సుదకుఁ దమదౌష్ట్య మొకనాఁడు సుబ్బఁగానె
దిక్కుమాలినచావు నొందెదరుగాదె.

(దుఃఖముతో) హా ప్రభువులారా! హాహతకబాంధవ్యులారా! మీ రెచ్చటికిఁ బాఱిపోతిరి? ఎందుఁ డాఁగితిరి? మీ దురంతమే మిమ్ముల నింతకుం దెచ్చినది. అయ్యో! మీరు చేసినదుష్కృత్యము లిన్నియు నన్నియు నని వక్కాణింపవలను లేదుగదా. చిత్రాంగి దుర్బోధనల విశ్వసించి సత్యఋషి యగుసారంగధరుని దుర్వ్యసనంబునందింపి మీ మీ కోరికలు ఫలింపనికతంబున నాతనికిఁ జెప్పరాని ముప్పు గలిగించితిరి. ఆపాపపుఁజిత్రాంగి ప్రాపునొంది గర్వంబున నుత్తమోత్తము లగునయార్ణవనీతిజ్ఞులను జేరనకుమాత్రము మంత్రులనుగా నుంచి తత్పదంబుల నాక్రమించుకొంటిరి. అచ్చికబుచ్చికమాటలాడి చిత్రాంగినొప్పించి సేనలం దొలఁగించి భిల్లుల నెసకొలిపి యూళ్లుదోపించి మీ లోగిళ్లు నిండించుకొంటిరి. దారులు గొట్టించి బాటసారుల నలంచితిరి. నారులం జెఱపట్టి సంసారుల హోరున నేడిపించితిరి. ఇంతకాలమునకు మీపాపము బద్దలయినది. మీ రాపతివ్రతాశిరోమణి యగువిప్రాంగనను జెఱపట్టుటచేఁ గదా భగవతి యగుగౌతమి కాగ్రహము వచ్చి నయార్ణవనీతిజ్ఞులఁ బురికొలిపి మీ సౌధంబుల ముట్టడింపించినది. కాఁబట్టియే సారంగధరునివిషయమున మీకును జిత్రాంగికిని జరిగినరహస్యలేఖలు బయలుపడినవి. ఇంక నెందుఁ బోఁగలరు? మీకు మరణమే శరణము. ఓదిక్కుమాలిన

చిత్రాంగీ! గడనచెలి వసునీగడుసుఁదనమే నిన్నింతకుం దెచ్చినది. నీ వాసేనలఁ దోలఁగించుటం జేసి చలపట్టి దండనాధులందఱు పూర్వసచివుల నాశ్రయించి సమయముకనిపెట్టి మా ప్రభుగృహంబుల ముట్టడించిరి. అంతతో నంతయుబయలుపడినది. ఇసీ! పడకటిల్లే ప్రాణాధారము చేసికొనుపడపుఁజెలికిఁ బరిపాలనాక్రమం బెట్లు తెలియును? పెంటి డేఁగలచేఁ బోషింపఁ బడెడుడేఁగపోతులరీతి విటులన వేఁటాడెడువిటకత్తియలచేఁ బోషింపఁబడు బోగంపుఁబోతులారా! ఏపనిపాట్లులులేక నిద్రాకలహంబులచేఁ గాలంబు పుచ్చెడుసోమరిపోతులారా! పరభాగ్యోపజీవులారా! మిమ్ములఁ దలఁచికొనిన జాలి గదురుచున్నది. మీ కాసాబంతులు; మీసాల మెఱుఁగులు; వేసాల పసలు; వాసన గందాలుఁ; జీనా యద్దాలుఁ; జిమటా పనులుఁ; జీనాంబరాలు నేఁటితో నీటఁగలసెనుగదా. మఱచినమీజాతిధర్మమును మఱలఁ దలఁపునకుఁ దెచ్చికొనవలసివచ్చినది. రాజ్యమును వాహతకబాభ్రవ్యులును; రాణివాసమును మీరును జిత్తమువచ్చినట్లు ధ్వంసము చేసితిరి. ఇప్పటికి మీ రాజభోగములన్నియు మన్నునం గలసినవి. ఇఁక నెందైనఁ బాఱిపోయి మఱియొకతావు చూచికొనుఁడు. అయ్యో! నా యీతలపోఁతల కవకాశంబు లేదు. నే నిచ్చటఁ దడయరాదు. రాజభటు లెవ్వరైనఁ జూచి నన్నానవాలు పట్టి పట్టుకొందురేమో. ప్రభువుల యానతి కావున జరిగినదంతయుఁ జిత్రాంగికి వినిచి యిదివఱకు చేసినమహాపాతకంబులు వోవుటకై జగత్కమలం బగుశ్రీవారణాసీనగరంబునకుఁ బాఱిపోయి విశ్వనాధుని సేవించుచు బిచ్చమెత్తుకొని బ్రదికెద (అని పాఱిపోవుచున్నాఁడు)

ఇది ప్రవేశకము.



శ్రీరస్తు.

# కుముద్వతీ సారంగధరము.

## పంచమాంకము.

రాజరాజనరేంద్రుఁడు వేగవంతుఁ డనుకంచుకితోఁ
బ్రవేశించుచున్నాడు.

ప్రదేశము—రాజభవనము.

రాజ—ఓరీ వేగవంతా! పాదుకలు మోయువాఁడును; బాకము చేయువాఁడును దుదకు వాకిలి తుడుచుదానియుఁగూడ నన్నలుసుచేసి నా మాటవినిపించుకొనక యున్నవారు.

వేగ—ప్రభువా! ఇది యెవ్వరిదోసము?

రాజ—ఆఁడుదానిచేత నధికారమంతయు నిడి యాఁడుదానివలెఁ గూరుచున్న నా యదియే.

వేగ—ప్రభువా! గడచినగాథలను ద్రవ్వుకొనుటవలన నేమి ప్రయోజనము?

రాజ—ఓరీ! నిజము చెప్పెద. ఇప్పుడు చిత్రాంగి నాయెడఁ గలతొంటిప్రేమాతిశయమంతయు దూరచేసినది సుమా.

వేగ—(తనలో)

ఆ. వృద్ధుఁడైనజీవవిభునిఁ గులస్త్రీలె
యేవగింతు రనఁగఁ ద్రోవఁగాచి
విటులకొఱకు వెదకు వేశ్య యీనరపాలు
నలుసు చేయు టొక్కయబ్బురంబె

(ప్రకాశముగా) మహాప్రభూ! ఏలినవారు ప్రాణంబు ప్రాణంబుగా మన్నించు చిత్రాంగి; అఱచేతిలోని నిమ్మపండువలెఁ దమచేగారవింపఁబడు చిత్రాంగి;

లోకమునం గలసమస్త ప్రశస్తవస్తువులకంటె మిమ్ములనే ఘనముగాఁ జూచికొను చిత్రాంగి; మి మ్మెడఁబాసినప్పుడు విరహవేదనచే నన్నపానాదులు వర్జించి మీకై పలవించుచిత్రాంగి; వారాంగనయయ్యుఁ గులాంగనలందలపించు పాతివ్రత్యంబున వెలయుచిత్రాంగి; అమాయకహృదయ యగుచిత్రాంగి; సత్యసంధురా లగు చిత్రాంగి; తమయెడఁ గలుగుప్రేమాతిశయమంతయు దూరము చేసెనా ?

రాజ—(తనలో) ఓహో! నా బ్రదుకు వీనికిని హాస్యాస్పదముగా నున్నది. (ప్రకాశముగా) తొలుతఁ జిత్రాంగి యట్టిదియనియే భ్రమపడితిని జుమా. ఇప్పుడు నే నేమిపలికినను నా పలుకులకు భిన్నార్థములు కల్పించి యధిక్షేపింప మొదలుపెట్టి నది. ఎప్పుడైన నే నత్యంతప్రేమాతిశయంబున మాటలాడఁబోవ నది కూసము విడిచినకాలపన్నగమువలె మండిపడుచుండును. సర్వదా వాహతకబాభ్రవ్యులతోఁ గొలువు సలుపుచుండును. వారి ప్రోత్సాహంబుననే వెచ్చ మెచ్చుగునని చిత్రాంగి సైన్యమును దీసివేసినది. వలదనినందులకుఁ బ్రాయశ్చిత్తముగా నాకడ నుపచారము చేసెడుపరిమిత పరిజనమునుసహితము తగ్గించినది. యోగ్యులఁ దొలఁగించి నీచాతినీచుల రాజకీయోద్యోగులఁ గావించినది.

వేగ—దేవా! ఏలినవారు పూలవాల యనుకొన్నదిప్పుడు కాలసర్ప మగుట కాలవశము గాని మఱియొకటి కాదు.

రాజ—అట్లనకుము. ఇదియంతయు నీచజాతిం దెచ్చి రాచజాతిం జేర్చినమహాపాతక ఫలము.

వేగ—(తనలో) ఓ వెడఁగు తోఁడా! ఈ వివేక మారంభమున నేమయినది (ప్రకాశముగా) దేవా! దేవర సెలవిచ్చినది సత్యము.

రాజ—సారంగధరుని హింసించిననాఁటంగోలె నయార్ణవనీతిజ్ఞులు నాయెడ ననూయాపరులై ప్రవర్తించుచున్నారుసుమీ.

వేగ—(తనలో) ఒక్కనయార్ణవ నీతిజ్ఞులుమాత్రమే కాదు. చుక్కైన నూపిరిగలవారెల్లఱును.

రాజ—చిత్రాంగిచే విడువఁబడినదండనాథులెల్లఱును వారిదండఁజేరి యేవియో కుట్రలు పన్నుచున్నవారఁట.

వేగ—ఇది కింవదంతి కాని మఱియొకటి కాదు.

రాజ—మన మిందలిసత్యాసత్యములను నిపుణముగాఁ బరిశీలింపవలయును.

వేగ—(తనలో) ఈపరిశీలనాసక్తి సారంగధరునిపట్ల నుండినననిన్నితిప్పలు లేకపోవును

గదా. (ప్రకాశముగా) మహారాజ! నయార్ణవ నీతిజ్ఞులు సంస్థానమున నభిమానము గలవారు. వా రొకకీడు దలంపరు.

రాజ—వేగవంతా! సచివులహృదయము లిప్పుడు మాఱిపోయినవి. సైన్యము లెల్లను దమయధీనమున నుండుటంజేసి యాకస్మికముగాఁ గోటను ముట్టడించి హానిగలిగింతు రేమో యని బెదరుగదురుచున్నది.

వేగ—దేవరకా హాని?

రాజ—నాకు హాని గలిగించినను సమ్మతమే.

వేగ—చిత్రాంగికా!

రాజ—మ తేమి?

వేగ—(తనలో) ఆమె కడతేఱిన నన్నియుం దెన్నఁబడును. దక్కిన దేవుఁడు దానికి జావు పెట్టఁడు.

రాజ—ఆమెకు హానిగలిగినయెడ నా స్వాంతమెంతయు సంతాపించును.

వేగ—(తనలో) ఔరా! నిమిషమునకుఁ బూర్వమున విషప్రాయముగాఁ గానిపించిన చిత్రాంగి యప్పుడే యమృతతుల్య యైనది. ఆమె రూపము కన్నులకుఁ గట్టినట్లగ పడి యీరాజు నున్మత్తుం గావించెఁగాఁబోలు. ఆహా! వేశ్యా మహాపిశాచమా! ప్రభావ మన్న నీయదియే.

ఆ. ఎత్తిపొడుపులాడి; యేడ్పించి; విసిగించి;
యీసడించి; కినిసి; రోసముడిపి;
తన్ని; తిట్టి; యుమిసి; దాసానుదాసుగాఁ
జేసికొందు నిన్నుఁ జేరువాని.

(దూరమునకు దృష్టి సారించి చూచి) అదిగో! పూజ్యురా లగుగౌతమి యీదారినే వచ్చుచున్నది. ఆమె సచివజనాంతఃపురంబులఁ జనువుగలిగి మెలఁగుచుండును. కావున నా మెవలన నచ్చటివృత్తాంతము లెల్ల వెల్లడియగును.

[అప్పుడు శాండిల్యునితో గౌతమి ప్రవేశించుచున్నది.]

గౌత—(తనలో) ఇంతకాలంబునకుఁ జిత్రాంగీనామక వేశ్యామహాగ్రహంబు రోచ్చాటన మంత్ర తంత్ర యంత్ర ప్రభావంబుచేఁ జేఁ జిక్కినది. ఇంక

కులంబున కభ్యుదయం బగుఁగాక. ప్రజలు సకలసుఖంబుల ననుభవించుచు నాద మఱచి నిదురింతురుగాక. ఓసీ చిత్రాంగీ!

ఆ. ఇంక నీదుమాయ; లింద్రజాలంబులు;
పనికిమాలినట్టిపన్నుగడలు;
చెల్లవిదిగో! నీదు జీవంబుఁ గొనఁజాలు
నట్టి లేఖలెల్లఁ బట్టువడియె.

(ప్రకాశముగా) వత్సా! శాండిల్యా!

శాండి—అమ్మా! ఏమియాజ్ఞ.

గౌత—నీవు కులపతుల కడకుంజని యిట్లుచెప్పుము.

శాండి—అమ్మా! ఏమని.

గౌత—ఇట్లు (అని చెవిలో నేమో చెప్పుచున్నది.)

శాండి—అమ్మా! తమయాజ్ఞాప్రకారము గావించెద (అని నిష్క్రమించుచున్నాఁడు.)

గౌత—(ముందునకుఁ జూచి) అదిగో! రాజనరేంద్రుఁడు. కంచుకితో నేమేమియో మాటలాడుచుఁ గూరుచున్నవాఁడు. ఆహా! ఈతనియవస్థ యెంతకువచ్చినది.

చ. పలువురు సేవకావళు లవారణలీలల నూడిగంబులన్
జలుపుచునుండ; భూరితరసంపదలన్ దులఁదూఁగుచున్; దమిం
గొలువొనరించు నట్టినృపకుంజరనాయకుఁ డిప్పుడక్కటా!
పిలిచినదిక్కు లేనినిఱుపేదవలెన్ వసియింపనాయెగా.

ఇది యంతయుఁ జిత్రాంగీ ప్రభావము. సన్నిధి కరిగెద (అని సమీపించుచున్నది)

రాజ—(ఎదురుగావచ్చి) పూజ్యురాలా! నమస్కారము.

గౌత—అభ్యుదయ ప్రాప్తిరస్తు.

రాజ—భగవతి యాశీర్వాదమును బరిగ్రహించినాఁడ.

గౌత—గీ. క్షితిప! నీ మది నెటుతలంచినను సరియె
తెలుపఁబూనితి నొకటి సుస్థిరతఁబూని

రాజ—అమ్మా! ఆనతిమ్ము.

గౌత— కలుషభూయిష్ఠ మైనయిక్కలియుగమున
రాచజాతినిబోలు దుర్జాతి లేదు.

రాజ—భగవతీ! కతంబేమి?

గౌత—గీ. త్రోవలరికట్టి బాటసారులను గొట్టి;
చక్కఁదన ముట్టిపడునట్టిసతులఁ బట్టి
బలిమిఁజెఱఁబెట్టి; తన్నాయకులను నెట్టి
కేరుచుండుట యే ముఖ్యకారణంబు.

రాజ—అమ్మా! అట్టి నీచాతినీచు లెవ్వరు?

గౌత—వాహతక బాభ్రవ్యులు.

రాజ—తమ రెట్లుకని పెట్టితిరి?

వేగ—(తనలో) ఈ పయోముఖవిషకుంభములు

గౌత—రాజా! వినుము. ఇ ప్పురపరిసరారణ్యమునందు

మన్న భాగీరథి యనుపరివ్రాజిక నాకాప్తురాలు.

రాజ—అవును. ఆమె మహానుభావురాలు.

గౌత—నిన్నటిదినంబున నామెసన్నిధికరిగి చేయెల్లఁ బ్రొద్దుపుచ్చి; వేఁగుజామున బయలువెడలి; యుఘాఘుండు నభ మండలంబున గండుమిగిలి పిండియాఱఁబోసినట్లు పండువెన్నెలలు గాయుచుండ నొకజీర్ణదేవాలయంబు సమీపించితి.

రాజ—తరువాత. తరువాత.

గౌత—తరువాత నచటికి యమకింకరులవంటి తుంటరులు పదువురు తమవెంటఁ గొలువ "హాప్రాణేశ్వరా! రక్షింపవే" యని పరిదేవనంబు సేయుచుఁ గంటికి నేలకు నేకధారగా గోలుగోలున నేడుచుచున్నయొకక్రొన్ననబోణితో వాహతక బాభ్రవ్యులును వచ్చిరి.

రాజ—(ఆశ్చర్యముతో) తరువాత. తరువాత.

గౌత—పిమ్మట నేమిజరుగునో పరిశీలింపవలయు ననునభిలాషంబున నొకపాదమరువున నిల్చి; వారి ప్రసంగంబు నాలించి; బంటులందఱును బందిపోటుదొంగలనియు; నా శృంగారవతి వారిచేఁ జెఱపట్టఁబడినదనియుఁ దెలిసికొంటి

రాజ—(కోపముతో) అరే దురాత్ములారా! వాహతక బాభ్రవ్యులారా!

ఆ. తమిని దల్లిపాలు ద్రావి యాయమ బొమ్మె
ద్రుమ్మినట్లు నాదుకూడు దినుచు
నాదురాజ్యమునకె నానావిధక్షోభ
ముల ఘటించినారె? తులువలార.

(గాతమివంకఁ జూచి) అమ్మా! అనంతర మేమి జరిగినది?

గాత—గీ. ప్రభువ! వాహాతకునకు బాభ్రవ్యునకును
బోడమె నమరాగ మొకట నాపొలఁతిమీఁదఁ
బూర్వము తిలోత్తమా చంద్రముఖిఁ గనఁగనె
యొతిమె సుందోపసుందుల కొదవినట్లు.

రాజ—అమ్మా! తరువాత. తరువాత.

వేగ—(తనలో) ఆహా! అధికారకండూతిచే వ్యధ నొందెడుబధిరాంధకశవములకు సుంతయేని బాపచింత కలుగదుగదా. ఇంతకును వీరికి వినాశకాలము సమీపించినది. కావుననే యిట్టివిపరీతబుద్ధి పుట్టినది.

గాత—రాజా! అనంతరము వారు "నేను వరించెద. నేను వరించెద" నని కొంతసేపుతగవులాడి "రాణిగా రెట్లుచెప్పిన నట్లుచేయుదము. అంతదనుక నిరువురమునీమె నంటకుండునది" యని నిశ్చయించుకొని రోదనము సేయుచున్నయాసాధ్వీమణిని బలాత్కారముగా నీడ్చికొనిచనిరి.

రాజ—(కోపముతో) చిత్రాంగియు వీరలదౌష్ట్యమున నేకీభవించినదియేనా?

గాత—మఱేమి?

వేగ—దేవరవారికి రాణిగారి గుణసంపద వెల్లడియగుచున్నది గదా.

రాజ—తరువాత. తరువాత.

గాత—తరువాత నీదుర్ణయంబునకు భయాద్భుతక్రోధంబులు మనంబునంబెనంగొననప్పటికిఁజేయునదిలేక సరస్వతీమకంబునకువచ్చి కాల్యకృత్యంబులందీఱిచికొని వీధిలోనికిరా నటతిన్నెపైఁ గూరుచుండి యొకభూసురశిఖామణి గ్రుడ్లనీరు గ్రుక్కికొనుచు నీరెలుంగున "హా హృదయేశ్వరీ! హా సకలసద్గుణోత్తమా! హా సౌందర్యరాశీ!

ఉ. మానము గాచికోఁదగినమార్గము గానక కుందికుంది; నె
మ్మేనిఁ దొరంగియుందువు; సమీపమునన్ వసియించి యుండి; క

ట్టా! నయహీనులౌఖలు లహంకృతి నిన్గొనిపోవువేళ నేఁ
బూనికఁ బ్రోవనైతి; నీఁకఁ బూరుషశబ్దము నాకుఁజెల్లునే?

ఉ. చీఁకటియయ్యె మానసము చింతల నెంతయుఁ గ్రమ్ముకొంటచేఁ;
జీఁకటియయ్యె లోకము లశేషము నాకనుదోయి కక్కటా!
చీఁకటియయ్యె మిక్కిలిప్రసిద్ధికి నెక్కిననాదువంశమున్;
హా కమలాయతేక్షణ! దురాత్ములు చోరులు నిన్ను డొంగిలన్.

అని దుఃఖించుచుండఁ బరిచారకుఁ డుపచారవాక్యంబులు చెప్పి యూఱడింప మొదలుపెట్టెను.

రాజ—ఆ బ్రాహ్మణు నిల్లాలినే యీ దురాత్ములు చెఱగొనియుందురు.

గాత—మఱేమి?

వేగ—(తనలో) ఔరా! క్రూరులారా! రాజకులంబంతయు మైలమొనర్చితిరి.

రాజ—అమ్మా! తరువాత. తరువాత.

గాత—పిమ్మట నే నాతనిసన్నిధికిం జని "భూసురోత్తమా! ఎందుండి వచ్చుచుంటివి? ఏలచింతిల్లెదవు?" అని యడుగనతండు "అమ్మా! నాది వంగదేశము. పేరు విష్ణుభట్టారకుఁ డందురు. తీర్థయాత్రాచణశీలినై యిల్లాలితో బయలువెడలి నానా క్షేత్రంబులం జూచుచుఁ గోటిలింగక్షేత్రంబుఁ జూచునభిలాషంబున వచ్చుచు దారితప్పి యరణ్యంబునం జిక్కి దొంగలచే దోఁచుకొనఁబడుటయేకాక యపహృతభార్యుండను సహితమైతి" నని గోలుగోలున నేడువందొడంగె.

రాజ—తరువాత. తరువాత.

గాత—పిమ్మట నాహృదయమున జాలి గదిరి "బ్రాహ్మణోత్తమా! చింతింపకుము. నీవన్నెలాఁడిని జెఱగొన్న చెన్నఁటుల నే నెఱుంగుదు. ఇంతకు వా రామెకేవిధమగు చెఱుపును జేయలేదు. ఆరక్షకభటులచే నాదురాత్ములఁ బట్టించి బందిగమునవైయించిసాత్తుతో నీ యిల్లాలిని నీకు సమర్పించెద" నని యూఱడించితి.

రాజ—అమ్మా! ఆపరదారాపహర్తల నిప్పుడే పట్టించెద.

గాత—ఆపని నిదివఱకే పూర్తిచేసితి.

రాజ—ఎట్లు?

గాత—ఆక్రించులు మంచిమాటల మందలించినవినువారు కారని యెఱిఁగియున్నదాననగుటచే నయార్ణవనీతిజ్ఞులతో యోజించి దండనాథులం బిలిపించి; రహస్య

ముగా సేనల సిద్ధపఱిచి ; వాహతక బాభ్రవ్యులగృహములు ముట్టడించి ; సొత్తుతో నాబ్రాహ్మణిని బ్రాహ్మణునకుసమర్పించి ; తక్కినసొక్కమును మనధనాగారమున కనిపితి.

రాజ—(ఆశ్చర్యముతో) అమ్మా! దుర్భరకార్యము నిర్వహించితిరి. మఱి వాహతక బాభ్రవ్యులు పట్టువడిరా?

గౌత—లేదు.

రాజ—ఏమయిరి?

గౌత—పలాయితు లయిరి.

రాజ—సైనికులు వెంబడించి పట్టుకొనలేదా?

గౌత—ఉచితసైన్యముతో నయార్ణవుఁడు వెంబడించినాఁడు.

వేగ—అతఁడు వారలఁ దప్పకపట్టుకొనఁగలఁడు.

రాజ—నీతిజ్ఞుఁ డెక్కడ?

గౌత—చిత్రాంగి నగరు ముట్టడింపనరిగె.

రాజ—(భయపడి తనలో) హా హతవిధీ! ఎంతటివిపత్తు తెచ్చిపెట్టితివి? తమమాట నిరాకరించి సారంగధరునిశిక్షించుటచేఁ జలపట్టి మంత్రులేదియో దారుణము సేయఁదలపెట్టి యీ యుద్యమమునం దిగియుండవచ్చును. అయిన నడిగిచూచెద (ప్రకాశముగా) అంతటి దుర్వ్యవసాయంబునకుఁ గతంబేమి?

గౌత—చిత్రాంగి సలిపినమహాదారుణ కర్మము.

రాజ—అది యెట్టిది?

గౌత—వాహతకునియింట లభించినయీరహస్యలేఖలవలన సర్వంబును విశదమగును (అని కమండలువునుండి యొకజాబును దొలుతఁ దీసియిచ్చుచున్నది.)

రాజ—(పుచ్చుకొని వేగవంతునిచేతి కిచ్చి) వేగవంతా! చదువుము.

వేగ—(జాబువిప్పి చదువుచున్నాఁడు.)

"అంతరంగిక సఖిక లగువాహతక బాభ్రవ్యులకు. విరహవేదనా దోదూయమానమానసయై చిత్రాంగి వ్రాయురహస్యలేఖ. నా హృదయము శృంగారఖని యగుసారంగధరునియెడ గాఢముగాఁ దవిలియుండుటను గనిపెట్టి సిరిపట్టి కట్టలుకం జలపట్టి బెట్టిదపుటమ్ములం జిమ్మి యీయమ్ముల గాయమ్ములు సేయుచున్నవాఁడు. నే నానవమన్మథాకారుఁ గూరిమిమీఱఁ గోరికలార మనసారఁ గౌఁగిటఁ జేరుపకున్న శరీరంబు

నిలుపఁజాల. మీ రేచందముననైన నా సుందరాంగుఁడు నా మందిరమునకు వచ్చునటులుఁ జూడవలయు. కోరిక దీఱినతోడనే మీరలు కోరుకొన్న మాధవీమాలతులఁ దప్పకమీకొసంగెద ”

రాజ——(ఆశ్చర్యముతో) ఆవాక్యము లందున్నవా?

వేగ——సందేహమేమి?

గాత——రాజ! పైభాగమును వినుము.

రాజ——అవహితుఁడనై యున్నాను.

వేగ——(తరువాయి నందుకొని చదువుచున్నాఁడు)

“ ప్రభువువలన నుపద్రవము సంభవించు ననిజంకకుఁడు. యుద్ధమునఁ జావకయుఱలవచ్చినయెడ నావృద్ధరాజును సమయమారసి విషముపెట్టి చంపెద. అంతట తొడుసు మాసిపోవును. సారంగధరునితో నేను హాయిగా సంసారసుఖంబుల ననుభవింపవచ్చును. అప్పుడు మీరు పొందఁబోవు మహోద్యోగవైభవము నే నిప్పుడుగ్గడింపవలసినది కాదు ”

చిత్రాంగి వ్రాలు (అని చదివి యూరకొన్నాఁడు)

రాజ——వేగవంతా! ఆవ్రాలు చిత్రాంగిది యౌనో కాదో నిపుణముగాఁ బరిశీలించితివా.

వేగ——ప్రభువా! ఒక్క-వ్రాలుమాత్రమే కాదు. వ్రాఁతయంతయుఁ జిత్రాంగి స్వహస్తలిఖితమే.

గాత——రాజా! నీ కంతనమ్మకము లేకున్న మఱలనొకసారి కనుదెఱచి యీరాజకులధూమకేతువు వ్రాసినది యగునో కాదో నీవే పరిశీలింపుము.

రాజ——(లేఖ పుచ్చుకొని పరిశీలనగాఁ జూచి) ఓహో! ఇది చిత్రాంగి స్వహస్తముతో వ్రాసినలేఖయే. సంశయము లేదు. హా చిత్రాంగీ! ఱంకులాఁడీ! నీ చేయనెంచిన దారుణమంతయుఁ గుమారునిపై మోపి నిష్కారణముగా మారణము చేయించితివిగదే. (దుఃఖముతో) హా పుత్రా! సారంగధరా! (అని మూర్ఛిల్లుచున్నాఁడు.)

వేగ——(శీతలోపచారములను జేయుచున్నాఁడు).

రాజ——(మూర్ఛదేఱి) హా కుమారా! సారంగధరా! హా ప్రాణేశ్వరీ! రత్నాంగీ! హా కోడలా! కుముద్వతీ! లంజియమాటల నమ్మి మీయెడ నెంతనిర్దయుఁడనైతి (అని కన్నీరు నించుచున్నాఁడు).

గౌత—రాజా! ఊఁఅడిల్లుము. నీ జారత్వవిషవృక్షు మీఁచందమున ఫలించినది. ఈ రెండవలేఖనుగూడ సావధానుండవై వినుము (అని కమండలువునుండి లేఖను దీసియిచ్చుచున్నది).

రాజ—వేగవంతా! చదువుము.

వేగ—(లేఖను బుచ్చుకొని చదువుచున్నాఁడు)

"వాహతక బాభ్రవ్యులారా! మీరు శ్రమపడితిరి కాని కార్యము నెఱవేరలేదు"

రాజ—ఓసి తుంటరి తుటారికత్తియా! నెఱవేరినయెడ నే నింతకు నంతకునంతికంబున నతిథినైయుందును. పై భాగమును జదువుము.

వేగ—(చదువుచున్నాఁడు)

"తొలుత నన్యాపదేశంబుగ నాహృదయంబు వెలిపుచ్చి కార్యము గానక సిగ్గువిడిచి నా యనురాగంబును నేనే వెల్లడించుకొని భగ్న మనోరథనై యంతట తూష్ణీంభావము వహింపక యొంటిగదా యని పైఁబడి యుత్తరీయంబును బట్టికొని పెనంగిననతండు విదలించుకొని సత్వరంబున సురిఁగె. ఉత్తరీయము నాచేఁ జిక్కినది కావున నది యొక్క యంగమచ్ఛంబు గాఁగొని సారంగధరుండు నను వెలిఁబెట్టకయ మున్న యాతఁడే నను బలాత్కరించె ననిరాజునకుం జెప్పి నమ్మించి కాలు సేతులునఱుక నుత్తరవొనరించునట్లు కావించెద. గహాస్యమును మీరు భద్రముగాఁ గాపాడుఁడు. వెలిపుచ్చుటకు వెనుక దీయనిభ్రమరికా తరళికలఁ బాతాళగృహమునఁ జెఱనిడితి. ఇంకముందు మహీపాలుని మర్కటమువలెనాడించుచు మహీపాలనమంతయు మనమే యాచరింతము"                                                  చిత్రాంగి వ్రాలు.

(అని చదివి యూరకున్నాఁడు.)

రాజ—(బొమ్మ తట్టుకొనుచుఁ గోపముతో) లంజియా! నిజముగా నింతకాలమును నన్ను మర్కటమువలెనే యాడించితివే. ఛీ పాపాత్మురాలా! చిత్రాంగీ! నిన్నింతెంత తునియలుగానటికి చిత్రవధ చేసెదను.

నీతి—(తెఱలో) ఇంకను జిత్రాంగి యెక్కడ?

రాజ—ఇది నీతిజ్ఞునికంఠస్వరము. ఆదురాత్మురాలును దప్పించుకొని పాఱిపోయెనా యేమి చెపుమా.

నీతి—(ప్రవేశించి) జయము. జయముమహారాజా!

రాజ—నీకు స్వాగతము. చిత్రాంగియే లేదా?

నీతి—మ ేమి.

రాజ—పారిపోయెనా?

నీతి—లేదు.

రాజ—మ ేమయ్యెను?

నీతి—

గీ. తనదుదౌష్ట్యంబు వెలిపుచ్చఁదగినయట్టి
పత్త్రికలు రెండుతమచేతఁ బడెనటన్న
వార్త నొకసేవకుఁడు దెల్పనార్తినొంది
పడియె నొక్కయగాధ కూపంబునందు.

గౌత—రాజకుల మారిణీ! అధోగతిపా లగుదువుగాక.

వేగ—మోసాలమారీ! తప్పక యధోగతిపా లగుదువుగాక.

నీతి—పరమ జారిణీ! నరకకూపంబున ననేకశతవత్సరంబు లుందువుగాక.

రాజ—(కన్నీటితో) నా యవస్థ యింతకుఁదెచ్చినదిగదా. ఇంకఁ జిత్రాంగి యేనూతఁ గూలిననేమి?

గౌత—నీతిజ్ఞా! భ్రమరికాతరళికలను బాతాళగృహమునుండి విడిపించితివా?

నీతి—భగవతియాజ్ఞ కన్యథా యొనరింతునా?

వేగ—అదిగో! ఖడ్గపాణియై నయార్ణవుఁడు వచ్చుచున్నాఁడు.

గౌత—ఇంక వాహుతక బాభ్రవ్యులగతి యేమయ్యెనో తెలియఁగలదు.

(నయార్ణవుఁడు ప్రవేశించి) జయము జయము మహారాజా!

రాజ—నీకు స్వాగతము. వాహుతక బాభ్రవ్యులు పట్టుపడిరా?

నయా—లేదు.

రాజ—ఏమయిరి?

నయా—నిజాయుధములచే నాత్మహత్య గావించికొనిరి.

గౌత—పాపాత్ములారా! రాజద్రోహులారా! మీరు కుంభీపాతనరకంబునం గూలుదురుగాక.

వేగ—దుర్మార్గులకు దిక్కుమాలినచావు తప్పదు.

రాజ—ఇంక నెవ్వరేమయిననేమి? హా పరమహంతకురాలా! దురాత్మురాలా

చిత్రాంగీ ! మాటలఁ దేటలఁ బందిళ్లువెట్టి : కల్లకూరిమి పచరించి ; యఱచేతిలో వైకుంఠముంజూపి ; నన్ను మోహాంధకారంబున ముంచి ; తుదకు నావంశ మంతరింపఁజేసితివిగదా.

నయా—ప్రభువా ! “వారాంగనా సాంగత్యము శ్రేయస్కాముని కుచితంబుగాద” నితొలుత మనవిచేయలేదా ?

నీతి—మహాప్రభూ !

గీ. కాకిజాతిఁ దెలుపుఁ ; గడులంచగొండికి
న్యాయమందుఁ దలఁపు ; నాస్తికునకుఁ
బాపమందు జడుపుఁ ; బడపుఁబడంతుక
కొకనియందు వలపు ; నుండ దరుదు.

అని చెవినిల్లుకట్టుకొని మున్నే విన్నవించుకొంటిని గదా.

గౌత—మంత్రులారా ! అప్పుడు చిత్రాంగియెడఁ గలతీపి మీ మాటలను జెవి కెక్క నిచ్చినది కాదు.

నయా—కాఁబట్టియే కొండఁ ద్రవ్వి యెలుకను బట్టవలసివచ్చినది.

నీతి—ఇంతకును గడ్డిపరక మిణ్ణాగయినది.

వేగ—(తనలో) ముందు వెనుక లారయక ముంగినిజంపికొనినబ్రాహ్మణునిగతి యీమహారాజునకుఁ బట్టినది.

రాజ—మోహాంధుండను. యుక్తాయుక్తజ్ఞాన పరిశీలనా రహితుఁడను. నన్ను మీ రేమన్నను దలయొగ్గవలసినవాఁడను. (దుఃఖముతో) హాపుత్రా ! సారంగధరా !

గీ. తప్పునొప్పును దెలియునందాక నైనఁ
దాలిమివహించి కొన్నాళ్ళుతాళనైతిఁ ;
గాలుసేతులు నఱుకక కాననమున
నుండుటకునైనఁబలువనై యొప్పనైతి.

నయా—దేవా ! ప్రారబ్ధ మెవ్వరికి ననుభవింపక తప్పదు. ఊఁఅడిల్లుము.

నీతి—ప్రభువా ! బుద్ధి కర్మమునను సరించి యుండును. ఊఁఅడిల్లుము.

గౌత—రాజా ! ఊఁఅడిల్లుము. నేనప్పుడు చెప్పలేదా ?

ఆ. "ఇచ్ఛకంబు లాడనిటువంటి వెలవాలు
గంట్ల వేనవేల గడనసేయ
వచ్చుఁ గాని యట్టివరగుణాకరుఁ బుత్త్రి
గడనసేయుటరుసు పుడమిఁ జేఁడ!" అని.

రాజ—(అపలుకులు వినిపించుకొనకయే మహాదుఃఖముతో) హా సారంగధరా!

మ. తనయా! లంజియమాట నమ్మి నిను నిర్దాక్షిణ్యవృత్తిన్; మహా
వనభాగంబున డించి హస్తయుగమున్ బాదంబులున్ గోయనా
జ్ఞనుగావించితి దుష్టబుద్ధి నగుచున్; నా తండ్రి! యవ్వేళ నీ
మనమం దెంతవిచారమందితివొ భామాదాసు నన్నెంచుచున్.

హా ప్రాణేశ్వరీ! రత్నాంగీ! పుత్త్రఘాతుకుఁడను. కాదు. కాదు. వంశఘాతుకుఁడనే. నన్నొక్కసారి పలుకరింపవా? నీ ప్రార్థనను నిరాకరించినయీదుర్మార్గుని మొగము చూడరాదనుకొంటివా? కాదు. కాదు. నీ వట్టిస్వభావముగల దానవు కావు. నేనే మూఢుండనై తప్పఁదలఁచితి. హా జీవితేశ్వరీ! నీవే కృతార్థురాలవు. ఏమన.

ఆ. కొడుకుపాటు చూచి; కోడలు గౌతమిఁ
బడుట చూచి; దుఃఖపరవశతను
నీదు మేనుగూడ నిండునీటికి నిచ్చి
సుగతిఁగంటి; నేనె మిగిలి యుంటి.

చ. వరునకు సంభవించినవిపత్తు చెలుల్ వినిపింప; దుఃఖసం
భరితమనోంబుజాతవయి పాసితె? గౌతమిఁగూలి నీ యసూ
త్క్రమును; సత్సతీమణుల దారినిగాంచితివమ్మ నీవు; సు
స్థిరతను బండఱాతి నయి దేహమునిల్పితి నేనె కోడలా!

నీతి—ప్రభువా! ధైర్యము వహింపుము.

నయా—దేవా! ప్రశాంతి నొందుము.

గౌత—రాజా! భగవంతుఁడు నీకు దుఃఖశాంతిని గలిగించునుగాక.

రాజ—(దుఃఖముతో) ఇఁక నా కెక్కడిదుఃఖశాంతి. హా సారంగధరా! అప్పటి దీనాతిదీనం బగునీముఖకమలంబు కన్నులకుఁ గట్టినట్టు స్ఫురణకువచ్చి హృదయ ప్రవిదారణంబు గావించుచున్నది. నే నెట్లుప్రాణంబులు నిలుపుదు. ఇసీ మూఢ రాజనరేంద్రా! వేశ్యా సుఖ లంపటా!

ఆ. ఆలి ద్రిమింగి; కన్నచూలిని దిగద్రిమింగి;
చూలియాలిద్రిమింగి; నేలమీఁద
నెట్లు నిలిచియుంటి? వీ నీదుహృదయంబు
శిలను జేయఁబోలు నలువమున్నె

హా కుమారా! హా కుముద్వతీ! హా రత్నాంగీ! (అని మూర్ఛిల్లుచున్నాఁడు)

నయా—ఓహో! ఈతనికి మతి పోవునట్లున్నది. ఏమిగతి?

నీతి—శీతలోపచారములను జేసిచూతము.

గాత—ఇప్పటి కదే యుత్తమము.

ముప్వురును శీతలోపచారములను జేయుచున్నారు.

రాజ—(మూర్ఛదేఱి) అమాత్యులారా! నట్టడవులనక పట్టణములనక పల్లెలనక నా పలుకులుగా నిట్లు చాటింపవలయును.

మంత్రు—దేవా! సెలవిండు.

రాజ— గీ. “ఇల్లు గుల్లగు; సంసార మెల్లఁ బోవుఁ;
దెలివి నశియించుఁ గడునప్రతిష్ఠ వచ్చు;
వారకాంతల మరిగినవారలకును
ఇందులకు సాక్షి రాజనరేంద్రవిభుఁడె.” అని.

మంత్రులు—దేవర యాజ్ఞాప్రకారము గావించెదము.

రాజ—సచివులారా! దుర్భరమైనదుఃఖభారమును క్షణమయిన భరింపఁజాలకున్నాను. కావున నా యీశరీరమును వైశ్వానరున కింధనముగా సమర్పించి నిర్గతశోకుఁడ నయ్యెద.

నీతి—దేవర వా రట్లు సేయుటుచితంబు గాదు.

రాజ—ఔను. చక్కఁగాఁ జెప్పితివి. ఆలును గోడలు నవలంబించినమార్గము నే యవలంబించు టుచితము. (అని గోదావరివంక దృష్టినిలిపి) తల్లీ! గోదావరీ!

పరమపావనీ! దుర్భరపాతకుఁడ నైననన్ను భవద్గర్భంబునఁ జేర్చుకొందువా? ఇదేమి? కుడిక న్నదరుచున్నది? జగత్పావని యగుగోదావరి నన్నుం దనలోనఁ జేర్చికొని కృతార్థునిఁ గావించి "మహాపాతకహారిణి" యను నామమును సార్థకము చేసికొనఁదలఁచెఁ గాఁబోలు.

నయా.—ప్రభువా! ఈ దారుణదుర్వ్యవసాయంబును మానుము.

శ్రుతి—రాజా! ఈ రాజ్యలక్ష్మి ననాథం జేసిపోవు టుచితంబుగాదు.

వేగ—దుఃఖముచే మలమలమరుఁగుచున్నహృదయముల మఱింత దుఃఖపెట్టకుఁడు.

గౌత—రాజా! ఈ సాహసము చాలింపుము. మొండియై సారంగధరుఁ డెందైన జీవించి యుండెనేమో వెదకింపుము.

రాజ—క్రూరసత్త్వ సంకులం బగుకాంతారంబున నెంతకు జీవించియుండునా?

గౌత—ఆయువు గట్టిగానున్నయెడ నట్టడవియైనను బట్టణమైనను నొక్కటియే.

నయా—ఈ యమ్మ సెలవిచ్చినది సత్యము.

చ. చిలుకయు; నెల్క; చిమ్మెటయుఁ; జీలియు; శ్వానము; బభ్రువున్; విషో
జ్వలతర పన్నగంబు; మనుజప్రకరంబును నొక్కయింటనే
నిలిచి సుఖంచులీలను; వనీస్థలి లేడియు; మేఁక; గొఱ్ఱె; బె
బ్బులియును; సింహమున్; నరుఁడు పోడిమిమీఱు సుఖింపఁ గానమే.

రాజ—అమాత్యులారా! ఆవిధముగాఁ జూచినకుమారు నే నీవిధముగా నికఁ జూడఁ జాలను. అతని మీరే వెదకింపుఁడు.

క. దొరకినను ముద్దుకొమరుఁడు
స్థిరకును బట్టాభిషిక్తుఁ జేసినమస్తం?
బరయుఁడు మీరలు; నే నిదె
తొరఁగెద గౌతమినిమునిఁగి తుచ్ఛపుఁ దనువున్

అతఁడు దొరకనియెడ గోదావరి కుత్తరభాగ మొకరును; దక్షిణభాగ మొకరును గైకొని ప్రజాపరిపాలనం బాచరించునది.

గౌత—రాజా! మొదటినుండియు నీతమకమే నిన్నింతకుం దెచ్చినది. సారంగధరుం డేసిద్ధుని ప్రభావంబున నైన గరపదంబులు చక్కంబడి యేయాశ్రమమందైన నుండవచ్చును. కొన్నాళ్లు నిదానించి వెదకింపుము. ప్రాణత్యాగ ప్రయత్నము మానుము.

నీతి—పూజ్యురా లగునీ గౌతమి హితబోధంబు శిరసా వహింపఁదగినది.

నయా—అవస్యము శిరసా వహింపఁదగినది.

రాజ—(తనలో) ఈ గౌతమిపలుకు లుచితముగా నున్నవి. ఒకవేళ సారంగధరుఁడు బ్రదికి కంటఁబడునేమో. దుఃఖము నాఁగి కొన్నాళ్లు శరీరము నిలుపుటయే మేలు.

(అప్పుడు సుబుద్ధి ప్రవేశించి) దేవా! జయము. జయము.

రాజ—ఓహో! సుబుద్ధియా? నీకు స్వాగతము.

సుబు—మహారాజా!

చ. వెలిమిడిపూఁత దేహమున వెన్నెలగాయ; సురద్రుమ పల్లవం
బుల నిరసింప కెంజడలు; పొంకపుఁబించియ మొక్కకేల రా
జిలఁగను; నాగబెత్త మొకచేఁ దనరారఁగ; మీననాథ సి
ద్ధులు దయచేసిరయ్య; తమతోడను నద్దియె ముచ్చటింపఁగన్.

రాజ—వారు మహానుభావులు. శీఘ్రముగా దోడ్కొనిరమ్ము.

సుబు—చిత్తము (అని నిష్క్రమించి మీననాధునితోఁ బ్రవేశించుచున్నాఁడు)

రాజ—(మంత్రులతో నెదురుపోయి) మహాత్మా! వందనము.

—మీకు శుభమగుఁగాక.

..గౌత—సిద్ధశిఖామణీ! నీకు నమస్కారము.

మీన—పరివ్రాజికా! నీకు స్వస్తియగుఁ గాక

రాజ—మహాత్మా! అగతానాగత వేదులగుదేవరకు నాయవస్థ తెలియనిదికాదు.

మీన—మేము దివ్యదృష్టిచేఁ నంతయుఁ బరికించి దుఃఖశాంతిగావించుటకే వచ్చినారము.

నీతి—(తనలో) ఆహా! ఈసిద్ధునకు రాజకుటుంబమున నెంతయభిమానము!

నయా—(తనలో) ఈసిద్ధుఁడు మూర్తీభవించిన శంకరునివలె నున్నాఁడు. ఈతఁడు తప్పక ప్రభువునకు దుఃఖశాంతిగావింపఁగలఁడు.

గౌత—మునివర్యా! ఈ ప్రభువు నెట్టులైనదుఃఖమునుండి తెమలించి ప్రాణత్యాగము మాన్పింపుము.

రాజ—మహాత్మా! నా కెక్కడిదుఃఖశాంతి? హా పుత్రా! సారంగధరా! (అనికన్నీరు విడుచుచున్నాఁడు)

మీన—రాజా! ఊఱడిల్లుము. పిమ్మట సారంగధరుని వెదకింపవచ్చును. ప్రస్తుత దుఃఖశాంతి కే నొకయుపాయము దెలిపెద.

రాజ—స్వామీ! ఆనతిమ్ము.

మీన—

ఉ. చూపెద వేల్పులం దెవనిఁజూపుమటన్నను వానినింతలోఁ;
జూపెద మూఁడులోకములఁ జొప్పడుచోద్యము లెల్ల; మీర లే
రూపముఁ జూపుమన్నన దియాక్షిగఁజూపెద; నింద్రజాలవి
ద్యాపటిమంబుచే నరవరా! పగమానఁ గుమారుఁ జూపనా?

నయా—మహాత్ముల కసాధ్య మేమిగలదు?

నీతి—దేవర ప్రభావ మనిర్వాచ్యము.

గౌత—ప్రభావసంపదచే దేవరవారు నిజసారంగధరునిఁ జూపుమన్నను జూపఁగలరు.

రాజ—స్వామీ! చూపుఁడు. తప్పక సారంగధరుం జూపుఁడు.

సుబు—(తనలో) నా మిత్రునిప్రతిరూపము నీక్షించి కన్నులఁ జల్లఁబఱిచికొనియెద.

వేగ—(తనలో) యువరాజరూపమును జూచుభాగ్యము లభించుచున్నది.

మీన—రాజా!

ఉ. క్రూరతఁ గాలుసేతులు నకుంఠగతిం దునిమింపనీవు; కాం
తారమునం దపించుచును దాలిమితూలిన బాలుఁ జూపనా?

రాజ—అంతటి భీభత్సరూపమును నేను చూడఁగలనా?

మీన—చూచుట కష్టమే పోనిమ్ము.

తోరపువధ్యచిహ్నములతో దురపిల్లుతనూజుఁ జూపనా?

రాజ—అదియుం జూడఁజాలను.

మీన—

మారసమానరూప మహిమంబున నొప్పుకుమారుఁ జూపనా?

రాజ—స్వామీ! అట్టి కుమారునే చూపుఁడు.

మీన—(మయూరపింఛ మాడించుచు.)

ఉ. పాత్రము లెల్లజీవులు; ప్రపంచము నాటకరంగ; మబ్జినీ
మిత్ర ముఖగ్రహోత్కరము మింట వెలింగెడు కాచదీపముల్;
సూత్రధరుండు తానయయి సొంపుగనార్చుచునుండు నాజగ
న్మిత్రకు నింద్రజాలము మనీషనునిల్పి భజింతునెంతయున్.

అని ధ్యానము నభినయించుచున్నాఁడు.

గాత—(ఆకాశమువంకఁ జూచి) రాజా! ఆశ్చర్య మాశ్చర్యము.

రాజ—అమ్మా! అదియేమి?

గాత—గీ. మెఱుపు మెఱసినచందాన మింటినుండి
నేల కల్లదె దిగుచుండె నృపలలామ!

రాజ—ఎవ రెవరు?

గాత—గీ. ఎవని నెమ్మోముఁ జూడ నీ వెంచినావొ
యట్టిసారంగధరుఁడె సు మ్మరసిచూడు,

రాజ—(ఆశ్చర్యముతోఁ జూచి) ఓహో! ఏమి యీసిద్ధప్రభావము.

అప్పుడు సారంగధరుఁ డాకాశమునుండి దిగి మీననాథునిచెంత నిలుచున్నాఁడు.

అందఱు—(ఆశ్చర్యముతో) ఓహో! అచ్చముగా సారంగధరుఁడే యవతరించెనా యేమి?

మీన—(కన్నులు తెఱచి) రాజా! ఈ విగ్రహమునకును; నీకుమారునకును నేమైన భేదము గలదా?

రాజ—మహానుభావా! ఇంచుకయును లేదు.

చ. జలజవిలాసముం దెగడు చక్కనియాననయుగ్మయుంబు; వె
న్నెలదొరనేలు నామొగము; నీటగునానడపుం బెడంగహో!
తలఁపఁగ నా కుమారునివిధంబుననే సృజియించి; నా యెదం
గలుగఁగఁజేసి తెంతయును గౌతుకమున్ మునిరాజచంద్రమా!

(అని సమీపింపఁ బోవుచున్నాఁడు)

మీన—రాజా! దూరముగా నుండుము.

రాజ—మహాత్మా! అది యేమి?

మంత్రు—ప్రభువా! ఇది యింద్రజాలముగదా.

రాజ—అయ్యో! నా బుద్ధి పరమార్థమని భ్రమనొందినది (కన్నీటితో) హా సారంగధరా!

ఆ. ఇంక నెన్నఁడైన నిటువంటిరూపంబు
తోడ వచ్చి మాటలాడి నిన్ను
ఘాతచేసినట్టి కలుషాత్ము ననునూఱ
డించి కూర్మిఁ గౌగిలింతువయ్య.

మీన—రాజా! ఈ విగ్రహము నంతర్ధానంబు గావించెద.

రాజ—మహాత్మా! వలదు. వలదు. ఎంతకాలమైన నన్నిట్లు చూడననుజ్ఞ నొసంగుము

మీన—రాజా! ఈవిగ్రహము నంతర్ధానమైన గావింపనిమ్ము. లేదా మఱియొక్క వింతను జూపెదనుచూడుము.

రాజ—స్వామీ! సంసిద్ధుఁడనై యున్నాను.

మీన—(నెమలిపింఛె మాడించుచు.)

గీ. గగనముననుండి డిగియెడు కాంత లెవరొ
కన్నులారంగఁ జూడు మక్కజము గలుగు

రాజ—(చూచి యత్యాశ్చర్య మొందుచు)
ఒకతె రత్నాంగి; రెండవయువిద నాదు
కోడలైన కుముద్వతీ కువలయాక్షి.

అప్పుడు రత్నాంగియుఁ గుముద్వతియును దిగి సారంగధరుని
సరసనిలుచున్నారు.

అందఱును—ఓహో! ఈమె కేవలము రాణియగు రత్నాంగియే. ఈమె నిశ్చయముగాఁ గుముద్వతియే. అహా! ఏమి యీసిద్ధునిమహాప్రభావసంపన్నత!

రాజ—(దుఃఖముతో) మరణించినవారెల్లను నా కన్నులయెదుట ప్రత్యక్షమయినట్లు కనఁబడుటచే నాహృదయమున దుఃఖము పొంగి పొరలుచున్నది (అని రత్నాంగిని జూచి) హా ప్రాణేశ్వరీ!

క. వెలయాలిమీఁది తమిచే
బలుబాములు వెట్టినిన్ను బాధించినయీ
ఖలునకును నీ ముఖాంబుజ
విలసనముం గనెడుభాగ్య విధమెట్లబ్బెన్.

హా! గౌతమింబడి ప్రాణత్యాగంబు చేసికొని సుగతిగన్న నీ వెట్లు మఱలకంటఁ బడుదువు? హా జీవితేశ్వరీ! రత్నాంగీ! హా కోడలా! కుముద్వతీ! (అని మూర్ఛిల్లుచున్నాఁడు)

మీన—సభికులారా! మా యింద్రజాలవిద్యా ప్రభావ మవలోకింపుఁడు. ఇప్పు డీ విగ్రహముల చే మాటలు సహిత మాడించెద.(అని ధ్యానము నభినయించుచున్నాఁడు).

సారం—(రాజును సమీపించి) తండ్రీ! ఊఱడిల్లు మూఱడిల్లుము.

రత్నాం—(సమీపించి) ప్రాణేశ్వరా! కనుదెఱచి యొక్కసారి స్వజనముం బరికింపుము.

కుము—(సమీపించి) మామగారు! మీ కోడలి నాశీర్వదింపుఁడు.

రాజ—(మూర్ఛదేఱి సన్నిధి నున్న సతీసుత స్నుషలం జూచి) ఓహో! ఏమి యీ యద్భుతము! ఏమి యీ యాశ్చర్యము! నాకన్నులనే నేను నమ్మఁజాలకున్నాను. నాముందఱ నిలిచినవీ రెవ్వరు?

రత్నాం—ప్రాణేశ్వరా! ఇం దద్భుతమేదియు లేదు.

గీ. ఇతఁడు సారంగధరుఁడు నీ సుతుఁడుసుమ్ము
ఈవు విడిచినరత్నాంగిదేవి నేను
మన కుముద్వతినూవె యీ మగువమిన్న

రాజ—(అత్యాశ్చర్యముతో) ఇది నాప్రాణేశ్వరి కంఠస్వరమా? ఇంద్రజాలము కాదా?

రత్నాం—ఇంద్రజాలంబు గాదు; మఱేమి కాదు.

రాజ—గౌతమిం బడిన మీ రెట్లుబ్రదికితిరి?

మీన—వీరు గౌతమిం బడలేదు. గౌతమిపాలఁ బడిరి.

రత్నాం—ప్రాణేశ్వరా! తమ రట్లు సారంగధరునకు శిక్ష విధించినయనంతరంబ యే మిరువురమును దేవర యాగ్రహమున కెప్పుడుబలియగుదుమో యను భీతిచే నీయోగిసీమణి యగుగౌతమిని శరణు వేఁడితిమి. ఈమె మ మ్మీమీననాథుని యాశ్రమంబునకు రహస్యంబుగననిపి తమతో నట్లు మనవిచేసినది.

గౌత—ఇది నిశ్చయము.

రాజ—నఱుకఁబడినకాలుసేతులు మఱల సారంగధరున కెట్లువచ్చినవి?

సారం—తండ్రీ! ఈసిద్ధుని దివ్యౌషధ ప్రభావంబున.

మీన—ఇది సత్యము.

రాజ—(ఆనంద పారవశ్యము నొందుచున్నాఁడు)

సీత—ఆహా! భగవతి యగుగౌతమియు; మహాత్ము లయినమీననాథులును; రాజకుల ము నుద్ధరించి సకల జనాహ్లాదముగలిగించినారు.

నయా—విచారకథ లన్నియు వినోదకథ లయినవి.

వేగ—ఓహో! ఈ రాజకుటుంబము కన్నులకానందము గలిగించుచున్నది.

సుబు—మిత్రమా! ఎన్నినాళ్లకు నిన్నుఁ జూడఁగలిగితిని (అని సారంగధరుని గౌఁగి లించుకొనుచున్నాఁడు.)

సారం—సఖా! సుబుద్ధీ! నీకు శుభమగుఁగాక (అని మఱలఁ గౌఁగిలించుకొను చున్నాఁడు)

రాజ—(కన్నీరు నించుచు దీనత్వముతో) కుమారా! సారంగధరా!

గీ. పరమపాతకి నగుచును బడఁతిజెలియ
కల్లమాటలు నిక్కంబుగాఁ దలంచి
నిన్ను దండించినట్టి యీ నీచజనుని
తప్పు నెంతయుమన్నించి దయను జూడు.

అని పాదములమీఁదఁ బడఁ బోవుచున్నాఁడు.

సారం—(తప్పించుకొని) తండ్రీ! ఇది యుచితంబు గాదు. అదియంతయు నొక వేళ విశేషమున వచ్చినది.

మంత్రులు—ఓహో! ఇంతకంటె సంతోషసమయము మఱెప్పుడును గలుగదు.

వేగ—నిశ్చయముగాఁ గలుగదు.

రాజ—(కన్నీరు నించుచు రత్నాంగిని జూచి దీనత్వముతో)

గీ. జీవితేశ్వరి! నేను లంజియనునమ్మి
నిన్నుఁ గడువెతపెట్టితి నిశ్చయముగ
నన్ను మన్నించి; నాతప్పులన్ని సైచి
దాసునిగఁజూడు మిదిగో! వందన మొనర్తు.

అని పాదములమీఁదఁ బడుచున్నాఁడు.

రత్నాం—(తప్పించుకొని) నాథా! ఇది మిగుల ననుచితము. మిమ్ముల ననవలసినపని యేమి! మిమ్ముల నావేశించినపిశాచమువలన నింతలు పుట్టినవి.

రాజ—కోడలా! కుముద్వతీ! అల్పబుద్ధి సత్త్వుండ నగునన్ను మన్నింపుము.

కుము—మామగారు! నాపట్ల తమరట్లనుట ధర్మము గాదు.

గౌత—(వేగవంతుని చేతిలోనిలేఖలను బుచ్చుకొని) కుమారా! చిత్రాంగి నూతఁ గూలుటకును; వాహతక బాభ్రవ్యు డాత్మహత్య చేసికొనుటకును గారణ మీలేఖలే సుమీ (అని సారంగధరున కిచ్చుచున్నది.)

సారం—(పుచ్చుకొని చదివి) సుబుద్ధీ! నీ పలుకులు వినమింజేసిసుమీ యింతలు పుట్టినవి.

సుబు—మిత్రమా! కానున్నది కాకమానదు గదా.

(రత్నాంగియుఁ గుముద్వతియుఁగూడ నాజాబులను దమలోఁదాము చదువుకొనుచున్నారు.)

గౌత—వత్సా! సారంగధరా! ఇప్పుడు నీహృదయశుద్ధి యెల్లవారికిం దెల్లంబయినది.

గీ. ఏకపత్నీవ్రతుం డితఁడే యటన్న
మేటిబిరుదంబు నీయందె దీటుకొనియెఁ
బ్రజలఁ దనుగన్నబిడ్డల పగిదిఁ బూర్వ
మరసినమహాత్ముఁ డగురాము నంతుఁబోలె.

సారం—ఇదియంతయు భగవతి యనుగ్రహము.

మీన—రాజా! నీవు సారంగధరునకు శిక్షవిధించెడునాఁడే యీ గౌతమి నాకు వర్తమానమంపి కాలుసేతులు నఱుకఁబడ్డ నీబిడ్డకు నాచేఁ జికిత్స చేయించి నిజము వెలియై నీవుపశ్చాత్తప్తుఁడ వగువఱకు నీకుముద్వతీ రత్నాంగుల నాయాశ్రమమున కనిపినది.

రాజ—(గౌతమీ మీననాథుల పాదములపై వ్రాలి) భగవానుఁడా! మీననాథా! భగవతీ! గౌతమీ! మీరు నావంశము నుద్ధరింప నవతరించితిరి. కోటిజన్మములకైన మీ ఋణమును నేను దీర్చుకొనఁ జాలను. కృతజ్ఞతా సూచకముగా నొక్క సాష్టాంగ నమస్కృతి సమర్పించుకొనియెద (అని సాగిలి మ్రొక్కుచున్నాఁడు.)

ఇరువురు—అభ్యుదయ పరంపరావాప్తిరస్తు (అని లేవఁదీయుచున్నారు)

మీన—రాజ! స్వజనంబునుగూడి వర్ధిల్లుచున్నావు. ఇంక నీకేమివాంఛితము గావలయును.

రాజ—(అంజలి పట్టి)

క. వెలయాలిమాయ దాటితిఁ;
బొలిసె ననుచుఁదలఁచుకొనినపాలఁతిని సుతుఁ గో
డలిఁ గంటి నీదుకృప; ముని
కులతిలకా! యింక నేమి కోరుదు వాంఛల్.

అయిన నీకోరిక నెఱవేఱుగాత.

ఉ. వారవధూటుల స్మరిగి; వారలమాయలలోఁ మునింగి; సం
సారము మాపికొనక పురుషప్రకరంబు స్వభార్యలం గడున్
గూరిమిఁ జూచికొంచు; శుభగోష్ఠిని గాలముపుచ్చుచున్ సదా
కైరవమిత్రమౌళి పదకంజములన్ భజియించు గావుతన్.

మీన—తథాస్తు. (అని సారంగధరుం జూచి) వత్సా! సారంగధరా! నీ కెద్దియైన వాంఛ గలదా?

సారం—(అంజలి పట్టి)

క. కరపదయుగళము తమకని
కరమునఁ బడయంగఁగంటి; ఘనతరసిద్ధుల్
దొరకొనె; నపవాదఝురిం
దరియించితి నేమివలయుఁ దాపసవర్యా!

దేవర వరముప్రసాదింపఁ దలఁచితిరి కావున నీభరతవాక్యము సిద్ధించునుగాక.

చ. ధరణిపుఁ డెల్లకాలమును ధర్మముతప్పక భూమినేలుతన్;
ధరణి సమస్తసస్య సముదాయమొసంగి జనాళిమంచుతన్;
బరకృతులన్ గవుల్ సుముఖభావమునన్ గనుఁగొంద్రు గావుతన్;
బురహరుఁ డీశ్వరుండు మముఁ బూర్ణకృపం దరిజేర్చియేలుతన్.

మీన—తథాస్తు.

(అందఱు నిష్క్రమించుచున్నారు)

ఇది పంచమాంకము
సంపూర్ణము.

